కాగితము కరువువల్ల యీ వ ప్రచురణలు కొద్ది కాపీలే ముద్రిస్తున్నాము. కాన ప్రతి ఏజంటుకు మేము కావలసినన్ని కాపీలు సప్లయి చేయలేక పోవచ్చును. అట్టి పరిస్థితిలో పాఠకులు తమ కాపీని మిత్రులకు కూడా ఇచ్చి మా కృషిని సార్థకము చేసెదరని భావించుచున్నాము.

# మూగజీవాలు

[కథలు]

మా. గోఖలే

యువ బుక్ డిపో
43, ఆచారప్పన్ వీథి,
మద్రాసు & తెనాలి

# మూగజీవాలు

కాత్తె బాగా కన్నీకటి పడ్తుండది. వయసు మీనుండ యానాది ముసలాయి, బొమ్మలసందులో అల్లీళ్ల గెడపలకల్లి నిక్కీనిక్కీ సూసుకుంటా వొచ్చిచ్చి రామయ్యగారి గుమ్మం ముంగల నిలబడ్డాడు. "రామియగోరూ?" అని పిలిశాడు. "యాడికెల్లా రబ్బా ఎవురూ అగుపియ్యరూ?" అంటా గుమ్మందాటి లోనకెల్లాడు యిశారిద్దావని.

రామయ్యగారు కాత్తెవుండ మడిసి, పెల్లాం, ఇద్దరు ముగ్గురు పిల్లకాయా, పత్తాపోతా సుట్టాలజనం, పెద్దజాగాలో కమ్ముకునుండ పెంకుటిల్లూ, ఎట్టైనా కాత్తె పరవాలేదన్న కుటుంబం.

ఓరగా ఏసుండ తలుపు సందులగుండా లోనుండి దీపం ఎల్తురు ముంగల సాయిట్లోకి మూర ఎడల్పున సారగా పడ్తుండది.

"ఈడెవరూ లేరేం దబ్బా?" అనుకుంటా, అయినా పిల్లజనం ఏమొత్తెల కాడన్నా ముసుగులెట్టి నిక్కిసూత్తా వుండొచ్చని, ముసలాయి కళ్లు సాయిట్లో ఆడీడా కలుకుతా బోతావుంటే వో తంబం పక్కగా ఏందో కుదగా నుంది.

రామయ్యగోర్నిగాని, పిల్లజనంలోగాని, ఇంటి ఆడోల్లోగాని, ఇట్టాంటి దందాలు యాడా తగిలుండేట్టు ముసలాయికి అంతుసిక్క పోకాక, ఆ దందా మొదలు ఏంటై, అదెట్టుండో అని, అడుగు ముంగలకేస్తే సూపు బెదిరిచ్చి అడ్డది వుండేట్టుండి ఎటు లాగేత్తినా లగువోలప్పుకుంటా, బొల్ల గాలాం ఏసినట్టు దాన్ని సూపుల్తో లాగిబట్తా, దందా ఏందని యిశారన కొచ్చాడు ముసలాయి, పరీచ్చగా సూత్తూ.

ఇత్తడిబిందే, పక్కనదాంకుంటా సిన్న సెంబూ, కరకట్టుగా వుండయ్యాడ. ఆటివాలకం సూత్తా నుంచుండాడు ముసలాయి, దృష్టి సెదర్నీకుండా. రామయ్యగోరిజనం యాడుంగో, ఆయినమిల్లు గోరాకుండో, ఆనీ కేందో, ఇయాన్నీ యింకో పెపంచకం. ఆడ ఎవురూలేరు. ఇంకేవీలేవు. అయ్యో, ఆటుకాత్తెడంగా ముసలాయీ. అంతా గప్చిప్. ఆటివాలకం ముసలాయికి

నచ్చింది. అయి బోహలు గిరాకీ. మానూ వోళ్లు ఆటిన్నికల్లకెద్దుక లాక్కుం టాయి. ఆటిగ్గాను వొల్లు చెరనూసుకోను సానా వొత్తాయి. ఎటుసేసీ సుకం వుంటది. జెంకతో: ఆగిపోయినట్టు వొక్కాలు ముంగల కెల్లింది ముసలాయికి - గబాల్న మూర ఎడల్పు ఎల్తురు సారవిూన నుడిసి నీడబడ్డది - పైకెంటా న్నులేని బూమిమ్మన చీసాకాయిపడి పెట్టీమ్మంటా ఏంచెయ్యేదీ తెల్చినట్టయి —"దొర్సానమ్మగోరూ ?" — అనరిశాడు ముసలాయి, చీసాకాయితో బాటుతనూ బూమిమ్మన కొత్తా.

"ఎవర్రా అదీ ?" అంటూ వోరగా పేసుండ తలుపు తెరుసుకుంట్రా, రామయ్యగారి పెల్లాం సీతమ్మ సాయిట్లో కొచ్చింది, వంటోసన గబ్బ సునిపిత్తా. "నే న్దొరసానమ్మగోరూ, ముసలాయినీ—" కాత్తె సంబా లించు కుంటుండా, మాట కరకట్టుగా రాలా ముసలాయికి.

"ఓరి నీయిల్లు నేలగిట్టా! అం తరుపరచా వేంట్రా భయపడిపత్తేనా ? అబ్బ, వొళ్లు వొణుకుపుడుతున్నదీ! ఏం యిప్పుడు చచ్చావేం? ఏకీ, ఇక్కడెవరూ లేరే! ఎంతసేపయిందిరా నువ్వొచ్చి? నామతి బండలుగానూ, వీధి వాకిలి వేసుకున్నా చావనేం? వీళ్లేరీ? ఈపిల్ల పత్తులేరీ? ఆహా రాత్రులూ వీధుల్లో ఒస్తారేం, ఇంతంతలేరూ? తలుపుభాగ్గా తెరిచేవుంచే? వాళ్ళకేం కొంప గుండాన పడ్తుందే? అద్దరాత్రివరకూ యీ జంఘాల శాస్త్రి వుపన్యాసాలు ఎవరికిపడ్తుందే పూరికె పెనేసుకు తిరక్కబోతే? రాత! ఏవిట్రా ముసలాయి? చీకట్లో వచ్చావేం? కొందుకొచ్చా? ఇంకా నయం!" అంటూ, ముక్కూనా నోట్నా నీలుబోయినట్టు, వొచ్చిన కానే పిట్లో యుద్దం సేసింది సీతమ్మ.

"రామియగోరు లేరంటండీ?"

"లేరే. ఏవో, ఎక్కడ మండపెడ్తున్నారో, ఈ మొగుగునిపమ్మలవాళ్లక పొద్దుకూకులూ పొడుంకాయ కెంటువుంటే సరి, పెళ్లాం పెట్టుదమ్మలూ ప్రాణ్చ పెట్టుకుపోయినా సరే! బాసేవుంద మేళం! ఇప్పుడెందు కొచ్చావురా ముసలాయ్?"

"ఆఁ, ఏంలేదండి దొరసానమ్మగోరూ. పరేపో—నా సేవో—"

"నాబొందా నీబొందా! నత్తిముండాకొడకా! తెమిల్చిచావ్వేరా తొందరగానూ? ఆ ఎసరు మండి వచ్చిందో లేదో? నా పిండాకూడు వీడికి యీ పచ్చికట్టెల్ను మాడపెట్టారేం - ముష్టిబతుకూ! నూ షోరా ఆయి నింట్లోలేరూ? రేపురా పో? పద తలుపు దగ్గరగా వేసెల్తాను—ఒరె వుంగ్రా ముసలాయ్? కొంచెం రెండుకడవలనీళ్ళు తోడిపెట్టిపో నాయనా, నీకు పుణ్యంవుంటుంది? ఇంకోలో ఆయనగారొస్తే రావచ్చుకూడా. వుండు కడవ తెచ్చిస్తాను. అయ్యో నా తెలివి మండా! ఈబిందే చెంబూ ఇక్కడే వున్నయ్యే? ఇంకా నయం కనువుగోజుల్లో! మంచి ఘడియే! ఈ వచ్చిన వాళ్లు ఎక్కడికిపోయి చచ్చారో? వుంగ్రా ముసలాయ్."

అంటూ, ముసలాయి యాడన్నా మాంసపడ్తాడేమో అన్నట్టు, దబ్బున లోనుండి లాంతరుదెచ్చి, తంబానికి పక్కన వూగుతావుండే కొంకి సువ్వకు ఏల్లాడేసి, యింకూనేపిట్లో బుంగ తెచ్చిస్తా, "ఆ రొండుతొట్లు నింపుదూ నీకు పుణ్యం వుంటుంది." అన్నది సీతమ్మ, ఆడే నిలబడ్తా.

"నే నేసేత్తాలే దొరసానమ్మగోరూ. నిచట్టుమీన లాగాయనూ?"

"ఇదిగో, లాంతరు కావలెగా. నువ్వు కానీలే కొంచెం యిక్కడే నుంచుంటా. నీపెళ్లాం కాపురాని కొచ్చిందట్రా?"

"ఆఁ, ఏందో లెండీ!

"ఓరి నీ సిగ్గుమండా! వొచ్చింది కాబట్నా, మంచిదేనట్రా నీపెళ్లాం?"

"గూడెంలో ఆ లచ్చెన్న అంటారండీ!"

"వుంహూం! పేరేమట్రా?"

"వూఁ—"

"ముసలి వస్తున్నాడేట్రా వెధవా? వాడిల్లోనే లేమూ అంత బెట్టూ!"

"ఆఁ, ఏందోలెండి దొరసానమ్మగోరూ! చెప్పిరేకంట దానిపేరూ!"

"చెప్పవేం అబ్బా? గితే నాన్ని సంపాదించావన్నమాటే! పేరు కొంచెం నాగాగావుంది, బస్తీపిల్లేమిట్రా?"

"యాడండీ! అల్ల నెద్దమ్మ చెప్పి రేకంట లెండి."

"ఓహో తెలిసిందిలే. —ఆఁఆకడవ అక్కడే పెట్టు. కొంచెనేఁ, ఆపాకలో

పిడకలున్నయ్యా, అట్ట అక్కడేవుండాలే, తెచ్చి ఈ సావిట్లో పెట్టు నాయనా?"

"చాల్లే నాయనా. ఇహ యీ పిల్లలొస్తారు కావాల్ను ప్రాణాలు తోట్టానికి. కొంచెం ఆ నాలుగుమంచాలు యిట్టా బయటపడవేసి పెట్టూ, వంటింట్లో వుంటే సన్నిట్లా పిండుతారూ?"

"సందే లవుపియా మన్నారండీ, రామయగోరూ—"

"ఏకీ? ఎక్కడ వుట్టింట్టుకు వూరేగుతున్నారో!"

"ఆఁ, పొద్దు నవుపి తేనూ—"

"ఇహ పనేంవుందీ బాజా లెగరేసుకుంటూ!"

"ఓ పావల్దబ్బు ల్దయి సెయిమన్నానండీ."

"నా బొంద! ఇట్టా చచ్చిపోతున్నానేం పొయిమీద ఎసరు పెట్టొచ్చి? వొచ్చారంటే తాల ల్దగర్నించీ సమర్ధించాలి యీయన్తో! ఏరీ, వొస్తేగా ఏ వేళకి? ఫదీ పదకొండుగ్గానీ నాచావు నిచ్చావు కాదాయెను! రేపొద్దున కనుపించరా ముసలాయ్?"

"క్కా, తేవన్నా—బియ్యగ్గంజుంటే—"

"ఈమడి మండిపోతుండా! అన్నీ మెల్లోనే చస్తయ్యాయను! రే పెప్పుడయినా యిటు కనుపించుతావుగా? ఇదిగో అటు పోతున్నావు కావల్ను, ఆ దర్భలవాళ్ళింట్లో మాపిల్ల లుంటారు, కొంచెం కేకెయి నాయనా, మీ అమ్మ చంపుతుంది రమ్మనమనీ?"

* * *

"చీతారావమ్మగారి పిల్ల లీడకు రాలేనంటుండీ?" అనడిగాడు ముసలాయి, దర్భలోరింటి గుమ్మంముంగల నిలబడ లోనకు తొంగిసుత్తా.

"ఎవరదీ?" అని పెళ్ళేశాడు, లోగిలిముంగలి కాలీపెదేశంలో మంచమ్మీన కూకునుండ దర్భల చుబ్బయ్యగారు.

"నేనే ముసలాయినండీ దొరగారూ. అల్లపిల్ల లీడ కొచ్చారంటగా? ఆ చీతమ్మగోరి పిల్లలండీ? కాత్తె కేకెయిరా అంటేనూ—"

"నువ్వట్రా ముసలాయ్! ఒరే ఒకసారి యిటొచ్చిపోరా? వాళ్ళపిల్లలు యింతకుముందరే వెళ్ళారే! రాఘవయ్యగారి పిల్లల్తో వెళ్ళినట్టుంది! ఈపాటికి

యింటికి చేరుంటార్లే. ఇటొచ్చి కూచోరా కొంచెం—అబ్బ—యీ కుడి కాలి గిలకదగ్గిర బెణికిందిరా—అబ్బ—బ్బ—ఆయువుపట్టును లాగేస్తున్నదిరా తండ్రీ! వుస్—సీతారామచంద్రమూర్తీ—నన్ను బతకనిచ్చేట్టు లేదురా ముసలాయ!"

"మా వాపు వాసిందే దొరా! దెబ్బేడ దిగ్గారండీ కొనా?"

"మెట్లదగ్గిర కాలు జారిందిరా నాయనా! ఏంపాపం బద్దలయిందోరా రామయ్యాతండ్రీ! కాస్త చూడ్రా ముసలీ? అబ్బా—ఏవేఁవ్? ఇదుగో? అఁ? నిన్నే పిల్చేదీ? కొంచెం, ఆ ఆముదపు డబ్బా యిటు పట్టుకురా?"

"బాగానే వుంది ముచ్చట! పుట్టినన్నాళ్లకు పురుషుడు యుద్ధం చేశాట్ట! ఆ రాగాలీయుట మేవిఁటీ, ఆవెర్రికేకలేవిఁటి, పక్కింటివాళ్లు వింటానికి? అట్టా గొంతుచించుకుంటూ కేందుకూ వంటింట్లో వూపిరాడక చస్తుంటేనూ? నీ దెవడూ?"

"ఎవడో లే! అయినా మరీ నీతో యామచరగా వుందేవిఁటీ? ఓ చెంప బాధతో చస్తుంటే ఆ ఎగురుడేవిఁటీ? ఆ డబ్బా అక్కడ పెట్టిపో, మహా నువ్వేగాంగ ఆర్చి తీరుస్తున్నట్టూ! బాగానేవుంది!?"

"అబ్బే, మాకేం తెలుస్తుంది, తెల్లవార్లేస్తే రంగరించి పొయటం తప్పా—?"

"యింకా చాల్లే పదా, పళ్లు రాలేను—ఆఁ, ఆఁ! ఆ డబ్బా చూడ్రా ముసలాయ—వొలికిందా? ఎక్కడో దుర్గాంబ మా పాలిట పడ్డదేఁ! కొంచెం మెల్లిగా రాయి నాయనా? వుస్—రామచంద్రప్రభూ!"

"జనం అల్లాడిపోతంటే చూడనూసినా! కట్టాల పైపోయిందా దొరా."

"ఈ రోజుల్లో బలంగలమనిషే ఏడ్రా! ఎక్కడ చూసినా సోమరిపోతు సంఘాలు. అసలు ఇంటి కోగాగి లేందే యీదార్లెను ఇంటి పుణ్యపురుషులై కూర్చుంటారుట్రా? మాతాత తన్నేడు బియ్యం, మూడుగిద్దెల పప్పూ, సోలెడు నెయ్యీ, బుట్టెడుగారెలూ, తన్నేడు పెరుగూ, తినేవాడు. మావూరి విష్ణు రథాన్ని వొంటిగూడుతో హుమ్మని పట్టుకుంటే అది మోకాటికి వుండేలాగా పరుగెత్తిందని, యిప్పటికీ మనం అనుకోటం లేదుట్రా? అబ్బా—అబ్బ—కొంచెం నిదానంగా తోమరా తండ్రీ? ఇంతేకూ కలియుగం అంతానికొచ్చింది! అంతకన్న మరి ఏం లేదు!"

"నాట్లయినాల్టినుంచీ యియ్యాల్దాకా, మల్లీకూలిడబ్బులు కాన్రాకబోతే, ఏంబతికేట్టు దొరా?"

"ఎక్కడో ఆ మహానుభావుడు, వసంతదేవరాయలై జన్మించబోతున్నాడు! యీరాక్షసజాతిని చెండాడకమానడు! కృతయుగారంభం!"

"మాగూడెంలో కూకోంటున్నట్టు యాడన్నాకంటే కాపింతే సీపియ్యండి, ఈ సెవి కోసేసుకుంటానో లేదో!

"భూకంపం! జననాశనం! రాక్షససంహారం! శంకరదర్శనం! ధర్మం నాలుగుపాదాలమీదా నడిచితీరాలి!"

"పొద్దు పోతందది దొరా? నిన్న పొద్దుటాల్నుంచి కూడుదినక, అల్లాడిపోతండాం—"

"అరెరె! పొద్దు పోయినట్టే వుందే? ఇహ చాలుగానీ, కొంచెం ఆచేత్తోనే జరిపోవాల్సి యిట్టే అనిపో. ఏంవేం—ఒరే కనకం? నీళ్లు కాగినయ్యేమో కనుక్కోరా మీ అమ్మనూ?"

"రామియ్యగోరు, ఓ పావల్డబ్బు లిత్తానన్నారు గానీ, ఆయిన నిసిరేత్తిరిగ్గాని రాడంట్రా. సీతమ్మగోరు సెప్పిందండీ. ఇద్దరం నిన్నటాల్నుంచి కూడు తిన్లేదండీ. కాబట్టె - ఏవన్నా దయిసెయ్యండి దొరా?"

"అరెరె పాపం! యింట్లో ఆసలేమీ వున్నట్టు లేదే? యిప్పుడేం జేసి చచ్చేట్టు! వుదయం ఆశేషయ్యగార్ని బతిమాలిబతిమాలి ఓరూపాయి తెస్తే, ఆ నెయ్యిపాపిష్టిముండ కాస్తా, దాని సొమ్మంతా ఎగేసినట్టు నానామాటలని, అది కాస్తా తన్నుకుపోయె! అబ్బ! కాస్త పచ్చడన్నా దొరుకుతుందేమో కనుక్కొని చూస్తానుండు! ఒరే కనకం?"

"ఆఁ, ఏవింటికిలే దొరా కూసినిబియ్యవుంటే యిప్పియ్యండి సాలు—"

"చస్తున్నాంరా నాయనా! నేనేమో కుంటికోడినై కూచుంటినీ! వీళ్లు పిల్లవాణ్ణి పంపుతే వస్తారుట్రా, పాతరతీయించాలని వారంనుండి కొట్టుకుంటుంటే? యింతవరకు అతీ గతీ లేదు. అన్నీ బదుల్లే! ఎక్కడజూసినా బదుల్లే! నాశనం! అబ్బ—సీతారామచంద్రమూర్తీ — రామయ్య యీపాటికి వొచ్చివుంటాడేమో ఒక్క అడుగువేసి చూద్దూ? ఆఁ, ఎప్పుడయినా యిట్లాగే కనుపిస్తూ వుండరా—అబ్బ, రామయ్యతండ్రీ."

హైదరాబాదరా రామయ్యగారు యింటికొచ్చి, మీ నేసుకుండ గుడ్డల కాణ్ణుంచీ లోన శవమందాకా వూ రేవారాల్తో ముసిగుండట్టు "నీళ్ళతోడే సెయ్, గుడ్డలీసిబారెయ్, కట్టుకోనుగుడ్డా, ఒడ్డిస్సే సెయ్!" అ నావజాన అయీ, యియీ, ఏయీ, మడిసికి ఎంత లెక్క వొంటబట్టిందీ తెలవకుండా వుండే యవదానంలో, "మాపిటిపూట అగుపిసుమంటిరే దొరా?" అంటా తలుపు దట్టి ముసలాయి యిశారిత్తే, "అబ్బ బ్బ బ్బ బ్బ బ్బా! రే పిస్తాలే పోరా, అబ్బబ్బబ్బబ్బా! సల్లే రేపు రారా, అబ్బబ్బబ్బా—" అంటా గొణ గొణ గొణ లోనుంచి మోతపుట్టేపలికి, యీల మిగిలిపోయిం దనుకుంటా, సందు దాటి బజార్న బడ్తా, సల్లగా సెంచయ్య దుకాణంకాడి కొచ్చి, లోనుండ సావుకారు కగుపిత్తా ఓమూలగా నిలబడ్డాడు ముసలాయి, నెవంరేత్తా. "పొద్దున కట్టెలు పగలేస్తాన్న మనిషివి. పత్తాలేకుండా పోయినా వేందిరా ముసలాయ్?" అన్నాడు సెంచయ్య, దుకాణం సవిరిచ్చుకుంటా, ముసలాయి నోకంట సూసి.

"ఈ యానాదాళ్ళ పస్తన్నా పండుకుంటాంగాని, నీకూ నాకూ పలుకు తారంటయ్యా?" అంటా కొట్టుకు చేరాని కొచ్చిన ఓ పెద్దమనిషి రైతు కొడుకు, పుగాకుపాయ యీసలిత్తా, ముసలాయిమీద తిన ఆశ్చ్రాయం కాత్తె సిన్నయిసురుగా సూసి యిసిరాడు, అట్టా అవాల్సిందే అన్నట్టు.

"రేపెయిమంటే ఎయినంటుండి సాపీ? కాత్తె ఆ కీసుపిలుత్తే నాలుగ్గింజలు పుత్తయ్యాని బెవేంగానీ, లేకుంటే నాలుగు పేళ్లేసిబెడ్తే యీపేం బంగారం వొంగుగు దంటుండీ? రేపట్నే ఏసిత్తాలే సాపీ."

మొత్తానికి మీర్రా మన గాళ్ళు! అహాం, మనిషిని నమ్మకుంటే బేరాలింతే [illegible]! సరే చూస్తాగా! కొంచెం యీతౌసుంబస్తాలు లోపలికి పట్టూ?

"పడ్తాగానీ—కాత్తె నాకేవంన్నా కొలిపియ్యండీ, నిన్నరాత్రుంచీ కూడే లేదూ? రేపు మాపిటాలకల్లా మీది మీ కిచ్చేత్తాగా?"

"నికాల్సయిన మాటన్నావు, తరవాత ఎట్టుండాం!" అన్నాడు పెద్దమడిసి రైతు కొడుకు, సుట్టసుట్టి పంటిన పడ్తా.

"మంచోడివి! కర్యాపారం ఎలిగించి అంతా అయిపోయినాకా అప్పొ

సావుప్పా? ఈరోజుకున్న పెద్ద మనుష్యుల కాతాలు మాస్తే, మేం ఏంయాపారం చెయ్యాల్లో ఎట్లాబతకాల్లో యింతవరకూ అంతుపట్టటంలా! ఏందీ యీ బేరాలూ! ఎన్నాలేడిత్తే తీరేనూ? కొంచెం వీటిసంగతి చూడూ? రేపు రానువ్వా నేనూ యిక్కడుండే వోళ్లవేఁగా."

"కాత్తే ఎటునయినా సూడండి సెంచియగోరూ! పానం పాతండదీ!"

"ఇహా అదే వరసా వేళాపాళా లేకుండా? ఇంతకూ బస్తాలు లోప లేస్తానంటావా లేదంటావా?"

"ఏడొస్తుండది సాఁవీఁ, వొల్లు నీలుగాసుకుంటూ! కాత్తేవఁన్నా పెట్టండీ?

"ఇందరా పుగాకూ. కొంచెం బెల్లంవుంటే. పెట్టు సెంచయ్యా? పో, పో, యాడన్నా తంటాలు బడు. పో—".

* * *

"యాడికయ్యా నూ ఎల్లిందీ? ఈయాల్దాకా నూ యాడుండట్టుసలూ? కూడెట్టలేనోడియి, నన్ను సంపుగుదింటం దేనిగ్గా నయ్యా? నన్ను పంపియ్ మా అన్నోళ్లకాడకూ, ఎవుంటారయ్యా—" అంది చెసిరేక, ముసలాయి కంటి కగుపియ్యగానే మొర సైకెత్తుతా.

"ఏందమ్మోవ్ నీయ్యాటూ? రంపు సాగిద్దవులే లోనకు బా?" అన్నాడు ముసలాయి సిరాకుతో కాలీ సేతులు జాడిత్తా.

"తాలూ! తా లుండూ–నే మూ యింటికి బోతా".

"యాడికే నూ బొయ్యేదీ? ఓసి పాయే మాగాంగా ముద్దు సేత్తుంటేనూ!"

"అఁ నూయే ఆడ సేసేది! కశు మ్మాడ్స సంపుతా. తాలూ–నెడ్తా డేఁదమ్మా!"

"లోనకు పాయే, ఎటునోకట్ట సద్దా?"

"అఁ, యీడ సావటానికే వొచ్చింది! ముంగు సెయ్యొగులు–గుంజుతా వేడకీ? వుండ కాడా–తలుపేత్తా వెందుకూ–నే నుండనయ్యా లోనా!"

"కూకో? పెయిదూడకుమల్లే ఎగుస్తుండావుగాని — ఏందమ్మోవ్ నీపని మాలావుగుంది! కూకో ఆ వజానా?

"అరుత్తా—"

"పొల్లాడ్తయ్, జా స్తిగా లేశావంటే !"

"ఆ! అంత టోడివే! సంపెయిరాదూ సెనేశరం వొదులుద్ది? కడుపు గాలి సత్తుంటేనూ!"

"లేదులే వుండే. మన కేంవో సెద్దగిలిందిలే యే! అదేద్దిగానీ, పజ్జేసినా యిచ్చి సావకబోతే నాసెం మడిసిని గాదంటే? మరేవింటికమ్మా నీ వగలూ? కాత్తె సద్దుకుపా వద్దంటే?"

"ఆయినా యీడేవోం మాదరిద్రం గుండదయ్యా! యాడసూసినా పోసికోలు సంచేందీ? ఛీ, ముదనష్టం!"

"పాయే, నీకొల్లు మా బల్సిందీ? కాత్తె ఆ బామ్మల గడపకల్లి ఎల్లవే అంటే, నీకు అలి వయిద్దంటే పనీ?"

"అల్లతో మాసావయ్యా! ఏకాడికీ దిగ్గాలు దీత్తా నాన్ని సంపుతారూ! ఈతాకులు తెచ్చీ పియ్యాసాపలల్లుత్తా, అంటుంటే ఈతలే అవటంలాఅయ్యాకు!"

"ఎంబడిబడి నడుపిరుంసుకుంటే లేదుగానీ యీవేందో యాపారంసేసుద్దంట! పానీలేయే, దినం కల్సిరా కేడికి పోద్దీ? బగమంతు డుంటాల్లే అందర్నో కంటు కనిపెడ్తా!"

"తెల్లార్జావుంన నన్నూ ఎంటదీసి. కెల్లయ్యా, యాడన్నా పద్దేవు లాడ్తానూ?"

"అదిగాదంటే నే యిన్నాలూ సెప్పేవీ? ఆబుట్టలో పచ్చాపలు యింకూసి నుండాల గదంటే—?"

"అబ్బ, వుండయ్యా! తెత్తానూ—".

"బామినీలేదో, పానువూ సీ...యీ...నా—?"

"స్గిగ్గాయనే చిగ్గాయనే, సిత్తరేకా సెప్పాటకూ—"

---

# పల్లెగూడెంకాడ

రోజు టాలె సీతాయ్ ఎంకాయ్ పుల్లలేరుకోను, సేలన్నీ పాడ్తా, దిబ్బలంటా ఎక్కుతా. కుంటలంటా దిగుతా, ఆడ్తా, పదాలుపాడ్తా, గొడ్డమంద కెనకె మాలె కిట్టు కాలకిట్టుకు సేరుకుండాయి.

"యీయాల అచ్చరగాయ లాడ ద్దంటే, సీతాయ్? బాగుంతదే?"

"అద్దాం గానీ...ఎంకాయ్, నూతో ఓరాస్సెం సెప్పాలే?"

"ఏందే ఇల్లే, సెప్పే, సెప్పే!"

"ఓసార్తే సెప్పనని పెమానం సెయ్?"

"సేశాగా, సెప్పే, సెప్పే!"

"ఏందోనే......మరే......"

"ఓసెమ్మ పానీలేయే, నీకేమా వుండిలే పోయే......"

"అబ్బ లేపవు కందా?"

"లేపనాన్లేగా, సెప్పే?"

"...నా పెల్లంటే."

"నెల్లీ—."

"ఆఁ పెల్లంటే!"

"అమ్మో, ఎట్టా!"

"ఎట్టా గేందే!"

"ఎట్టాగేందీ? నూ పెల్లవుతా వనుకో! నీ మొగుడోడు నిన్నేడకో నాన్లే పేసుకుపోడాడే!"

"ఆఁ!"

"ఆఁ, ఎట్టా! నన్నుకూడా తీసుకుపోయే?"

"ఏం మాఅయ్య తిట్టుడూ?"

"ఎందుకు తిట్టాడమ్మా?"

"......"

"సీతాయ్, సీతాయ్?"

"నీకు మతుకు పెళ్లి కాదంటే?"

"ఏందీ...?"

"ఏం సంగనాసివే?"

"నేసెల్లాణ్ణుగా, నీకు మల్లెను కుండావా?"

"మీా అయ్యా సావ దన్నడూ?"

"మాఅయ్యా మంచోడుగా మీాఅయ్యలమల్లే..."

"ఆఁ, ముద్దెతుకుంతాడు...మరి పెల్లాడ కేం సేత్తావే?"

"ఏం సేత్తే నీకేం? యిట్టనే వుంతా, అసలు పెల్లెందుకమ్మా? నీకేం పెల్లాడావ్ ఏమన్నా సేత్తావ్, ఆశుకాత్తా లేపేసుకపోతే—"

"అస లయిందంటా? అయ్యా అవ్వా గదనపడ్తంటే, ఎసకమా లుండి యిన్నానే"

"ఏందీ? ఎట్టెట్టా!"

"పెల్లిసేత్తె బాగుంతదనీ, ఎటకారం సేత్తంది ముసల్ది......"

"పాసం తీశావుగండే, మరసనాడే అగుద్దన్నట్టు అడలగొట్టి సంపావూ?"

"నాకు మతుకు తెలుసెట్టా—"

"సొల్లే పెల్లికూతరా, యీపాలికి, నీమీాన గొడ్దిక్కొచ్చేసేదాన్నై యీయాలకల్లా! యిం కీతయీ దేయాలా, పుల్లేరె యాలా, బుల్లిక [illegible] సొల్లే సప్పరా".

ఆటలే ఆడాగా సిన్నిసిరతల్గా పాటలే పాడారా సోద్దెమ్మగానూ, యీతలే యీదారా యింత యింతగనూ, నాత్తెమంటా ఆడారా సిలిపి పిల్లోడా ఆటు!

సప్పసప్పున పుల్లాగిల్లా కట్టేసుక, సిన్నిపైటలెగరాడ్తా సిందులేత్తూ, గొడ్డెనకమాలె ఆడ్తా, పదాలు పాడ్తా, సందకాడయ్యేతలికి ఎప్పటాలె బొమ్మ [illegible] పల్లిగూడెం సేరేసు కుంటాయి ఎంకాయి సీతాయి......

"...అవ్వోయ్, అయ్యొచ్చాడంతే?"

"[illegible]"

పుల్లా ప్రుడకా పాయికాడ సక్కంగొకువ్వేసి, జుత్తు యిదలేసుకా, గాబు

కాడ కుండలోని నీలతో ఒల్లంతా ఆడీడ, సక్కగా కడిగేసుకా—

"అవ్వా, యియ్యాల బూలో కేందే?"

కూతురు లచ్చిపోయాక, తన కింకోరూ లేక పోటాన, సీతాయిని గారా బాన పెంచింది ఆది. పిడకా బొడకా అమ్మి, సీతాయి పెల్లిగాను కాత్తో కూత్తో యెన కేసింది. ఈరాయి మట్టుకూ, అత్తంటే మాఅభిమానం. పెద్దముండ యింత బూవొండిపెడ్తా యిల్లు కనిపెట్టుకుంటది, తను సాటుసాట్న ఏం సేసుకున్నా, కూతురంటే పానాన. ఆసాముల పన్లకుపోతా, నాలుగుడబ్బులు తెత్తా, అందరాలెకూడా పోయేవోడు యీరాయీ.

తన కేయాల ఏమొచ్చిపడుద్దో, సీతాయి పెల్లిసూసి సత్తానంటూ మొండి కత్తి కూకుంది ముసల్ది. పదమూడేల్ల సీతాయికి పెల్లేందందామా, పానీ, యిది మంచి, యిదిసెబ్బ, అని సెబదామా, ఆకూత్తే వోడెపాలన్నా పడుద్దేమో? చరేనంటూ, మంచి పిల్లకాయ దొరుకుతాడేమోని, సూత్తుండాదు...

"కుండలో నీలుపోయే తల్లా, సీకెటయి పోత్రల్లా?"

"ఏందమ్మా పద్దాకా తిప్పి సంపుతావూ, బూలోకి ఏందమ్మా, అంటే—"

"తెల్లద్దలేసి రోయపప్పు...అయ్యో సంబామా! మొదులు నీలు లేవంటే?

"ఊఁ" అని మూతి తిప్పుతా గబగబ కుండసంక సేసుకు లగెత్తుది సీతాయ్... "కుంటకాడికి నీలకొత్తావంతే ఎంకాయ్".

"వత్తున్నా వుండేయ్..."

"యీయాల సందమామ ఎంత బాగుండాడె"...

"సల్లసల్లగ రారా సక్కనయ్యా" (సీతాయ్ పాడుద్ది) "సందమామా, సందమామా నూ, దామంటె వత్తావ సందమామా ?"

(ఎంకాయ్ అందుకుంటది) "ఆటలంటు ఆకాసుంతె సూత్తానె నవ్వుతానే"

"సందమామా, సందమామా నూ అల్లిబిల్లి ఆడ్దాం వత్తావ సందమామా?"

"రామంటె యీలవుద్దా, సెట్టుకింద ముసలవ్వ కొట్టుద్దీ, తిట్టుద్దీ"

సీతాయ్ పాట "సందమామా సందమామా నూ రాకుంటె నే ముద్దు పెట్టనోం సందమామా ?"

"ఎన్నముద్ద తినేయేల నీతో కెకూనుంటా, నీకాడ బూ తింటా"

"సందమామా సందమామానూ పద్దాకుంటే సాలు సందమామా"

"బద్రమమ్మా కాల్ జారుద్దీ! కుంటకీయాలే నీలుబెట్టారూ"

"నాట్లొచ్చాక మావ్వ నన్ను నాటుకుతీసి కెల్తాండిగా"

"అబ్బా నేమతుకు రానెట్టా మా అయ్ నడిగి?"

"నూ రాందీ, పోను మనసుపోద్దంటే?"

"బలేకుశాలగుంటదే. ఏం? ఆల్లందర్నీ ఎనక మాలపెత్తి ఆ వజాన సేనంతా నా బెయ్యం? హుం హుం"

"ఆ లెక్క లేకుండా, ఆ మాత్తరం సేయ లేంగా?"

"సీతాయ్, సీతాయ్, ఇయాల మనిద్దరం ఓకాడ బూతింటామే"

"ఓకాడే పండేసుకునీ, ఎన్నెట్లో కతలు సెప్పుకుండాంగా!" ......

* * *

"తెల్లగా తెల్లారిపోంది, ఇదేం దమ్మా యింకా లెగనరూ! సీతాయ్ ఎంకాయు లెగవండి లెగవండి, ఇదేందమ్మా! రేత్తిరంతా సంబ్రకుతిన్నారూ? లెగే చీతాయ్! శాకీరి సేసుకో కళ్లా?..."

"ఏందమ్మా...కూసేపుండు......"

"ఓసి నీయిల్లు నేలగట్టా, అ యుర్యాకి కల్లాళ్ళ!"

"ఆ...అయ్య రేత్తిరే యాలకూ రా లేదు మ్మా!"

"సెబతా, లే, పనంతా ఆ వజానుందీ!..."

"ఎంకాయ్, ఎంకా—లేశావంతే! ఈయాల దబ్బబున పంచేసుకొ, సద్దిబూ తిని పుల్లేరుకోను కిల్లకాలవకు పోవొద్దూ!"

"రేత్తిరిసెడ్డ—బాగుందే...పోతున్నావుండే...కేకేత్తావుగా"...

"ఆయ్యేడికెల్లాడమ్మా, కొత్తపయిటా కొత్తరెయికా తెత్తానీ?..."

"నిసిరేత్తిరసంగా వొచ్చి, పెదపాలెంకాడ ఓపిల్లోడున్నాడు, సూసొత్తాని, పెందరకాడే లెగిసిపోయే"—

"పాపం తెత్తాని ఆసెపెత్తీ?"...

"తేడంటే, పెల్లంటూ లేకేన్న! ముకుకులూ దుద్దులూ కడాలూ, ఇయన్నీ పేయించనూ?"

"నా కొద్దు పో, అసల్నే పెల్లాణ్ణా ?"

"మా సిట్టమ్మే, ఏం పోకిడ పోతాయే, పెల్లయిన పరసనాడు మమ్మల్నసలు సూత్తా !

"ఊఁ...మరి ఎంకాయ్ నాతోకూడా రావద్దమ్మా ?"

"ఛీ! తప్పుకాదంటే, ఆదిమటుకు కూకుంతదెత్తా! వాల్లయ్య దానికి మటుకు పెల్లి సెయ్యడూ? మాసక్కా సాగుద్ది పెల్లంతూ. కావాలగాని... సాల్లే వగలు, సద్ది బూ తిందువురా ?"

"ఊఁ:..."

"కొక్కిరిద్దువులే, మొగుడ య్యొత్తే..."

* * *

"ఎంకాయ్, నే పోతుండా?..."

"ఒచ్చొచ్చె!..."

"సూశామ్మా, గోడ్డపిల్లోళ్లు పోతుండా రప్పుడే!"

"పానీలే ఎనకమాలె పదాలు పాడుకుంటా పోదాం"

పాట సీతాయ్ "సిత్రమంటావు, సెలరేగి సిందేసె సిన్నికుష్టుడూ"

పాట, ఎంకాయ్ "ఓయమ్మ యశోదమ్మ యినవమ్మ యింతింతలూ"

పాట సీతాయ్ "ఎన్నముద్దాలన్ని యిరివిగా తింటుంటె, సెప్పవత్తావుంటె సెంపపగలా గొట్టి సక్క బోయేనూ".

"ఇంతింత లేంది యినుయశోదమ్మ సెంప పగాలాగొట్టె సిలిపి కుష్టుడూ!"

"పాలకంటా బోయి కోడలాత్తావుంటె సెయిబట్టుక సరసమాడేనూ"

"ఇనవమ్మ యశోదమ్మ ఎట్టా బతికేటట్టు సొరవసేసుక సంపుతావుంటే!"

"ఎకిలి పనులాంట సెయిబట్టుకో బోతే పేడముద్దా తీసుక సిందకొట్టాడమ్మ"

"ఇనవమ్మ యినవమ్మ యెశోదమ్మ సంపుతాడంట సెప్పకుండేదెట్ట?..."

"దొద్దొద్దొద్దొ —గట్టుకసేరాం!..."

"ఓలెమ్మ ఏం లగెత్తుండే, కాలవా;"

"ఈతలేదాం ?"

"బొమ్మరిల్లు కట్టుద్దూ ?"

"చెల్ !..."

"నూ పెళ్లికూతురువంట! నే పెళ్లికొడుకునంట ! ఇల్లు కడదామంట!..."

"మరే,... నేపెళ్లాడ బోతున్నాగా ! మాఅయ్య... ఎల్లాడుగా ?"

"పానీలేయే, నాసంగ తోరిక్యా—వాలా ?..."

"హి హి హి ! ఒకమ్మాయి అలిగింది, పానీలేమ్మా, తమాసె కంటేనూ ! వొప్పుడూ మనిద్దరం ఒకటిగా"

"సత్తె ప్పెమానం సెయ్"

"సెమానం !"

"మా సీతాయ్ !"

"తానా లాడదాం ?"

"ఓ— కెరటాలా లెగుస్తున్నయ్యే, ఒడ్డుకాణ్ణే వుందాం"

"ఎవురు లేల్రే...దిగు దిగు..."

"వ్రాయ్-వ్రాయ్-వ్రా—"

"ఓ ఓ ఓ..."

"అబ్బ తోసుద్దేం?"

"ఎగ్రగుస్నై కొత్తనీలు...టప్ టప్—"

"కెరటాలా లెగుత్తున్నయ్యే—"

"అమ్మో పామే ! పామే ! నాయనో—ఆడే ! ఆడే, యాడే!—"

"యాడే—అయ్యో—ఓమ్మో—సీతాయ్, సీతా—యాడకే — లోపలికి పోతుండాన్ !—"

"ఎంకాయ్—పోతుండా—"

"ఒస్తుండా—సీతాయ్—వుండే—"

* * *

కెరటాలా లెగ కెరిగి పడ్డయ్! తోసేసుకు పోనై బొమ్మరిల్లుతో నూండా.

"కాలవ గట్టేందో కరిగిపోతేను, గొడ్డకాడో ఎంత గొల్లుచున్నారు— గుండెమంతా కూడ గుబ్బగున్నది—"

# యుద్దం

నాంచేరు ఆ మద్దెన అంత జబ్బునబడి లెగిసినాల్నుంచి మడిసి మాసరా మార్టం, పెల్లాం యీరికీ మనసు యిసిగింది, కూతురు ఎంకట్సుబ్బికీ ముత్తా బులకు కనాకట్ట మయింది, అల్లుడు అక్కులాయికీ అలక లెగిసినై, మంచీ సెబ్బరు యీల్లందర్నీ కనిబెట్టుకుండ ముసలాయికీ వుసారు మల్లింది.

తను బొమ్మలాటలే ఆడేడో, డబ్బే సంపాయించాడో, సేసే పెసిద్ద యిందో! యిదవి అదివీ ఏది బలాందయిందీ తేలవను యీలనని యిశారాల్లో వుండాడు నాంచేరు.

"సీసీ—యీ సెడయ్యా?"

పొయిపొగ వూపిరాడకుండా ముక్కునా నోట్నా పట్టంలో ఎనిపే ఎనిపే దొగ్గలాకు పొప్పును ఆపన్న అణ్ణెబారేసి, ఆ ఫెనిపే తెడ్డుసేత్తో పొగ యిది లిచ్చుకోటంలో పొప్పుకారం కాకంగా మొగాన ఆడీడ రాసుకుంటా సీదర బాదరగా 'అఫ్‌చ్ఛి, యీఫ్‌చ్ఛి' అంటాతుమ్ముతా ఒల్లునెట్టుకుంటా ఎట సవుతే యేం యింటే తలబడి ఎడటాపడ్డ ముసలాయినా సెర్నేసింది, నాంచేరు పెల్లాం, యీరి.

"ఏందమ్మదీ! ఒల్లటిరుసుకుంటావ్? ఇల్లీడనే వుండాడు మర్రిసెట్టుకింద."

"సూత్తుండావయ్యా, ఆమడి సాపజాన కూకోటం?"

ఏసిన ముసుగు సెవిసాయులకుండా మెల్దీసి మోకాల్లమీనకుండా ఒల్లంతి టా కప్పేసుకుని, ద్యానం ఏకాడుండా, యీరి ఎగురుకు అట్టరెప్పేసేసి, యిదికాదు ఆదనుకుంటా, మరోకాడకు ద్యానం బారుసేసి, ఆ ల్లింటికి [illegible] కాడగావుండ మర్రిసెట్టుకింద కూకు నుండాను నాంచేరు.

"ఏందియ్యా, నూ యీకూకోటం?"

"ఏందమ్మోళ్!"

"యిదేందమ్మా యీ మడుసీ! బొమ్మలాట సంగ తట్టుంచు. అట్ట ముసు కేసు కూకోబోతే ఆకాశం సెట్టుసెల్లి కాపలు పట్టక రారాదూ, [illegible] తుంగ కోసక రారాదూ! ఎండుమిరబగాయ లని లబో దిబో కొట్టుకుంటుండా

తేడేం! అక్కులాయిమటుకు ఎన్నాలని సత్తాడూ? ఏకాడికి దీపచ్చేమ్మాలె కూకుని — చరేగానీ, యిదేందీ! అక్కులాయిని సాగచ్చోకం వాయిత్తా నన్నావంట ఏంపుట్టిందయ్యా నీకూ, సాన్రాయికిమల్లె ఓ సోట కూసోకా?"

"వాసిపోయే, ఎంద్రకాయి మొగంనువ్వూ! అణ్ణి లంకేసు క్కొత్తుండావు గానీ!"

"అటనే అందువులే, తీసుకుంటా పెంజేరి మొగవేసుకుని! సిన్నెదప్ప ఆడ్తో నీకేం పనొచ్చిందంట! నలుగుర్లో నంటయ్యా అల్లుణ్ణి నాచొప్పెగాలు పడ్తానంటం? ముండసాలె కాన్రాకుండా—"

"వాసివుండే! కొ పువ్వాడ్డన్నె వోళ్లులేకా! మిడ్డేన ఎంతకింటం పుంకే మటుకు ఏలాపాంగా లేకండా కట్టుపడి సేసినపదాలు ఆవజాన వరసడిప్పి వాయిత్తాడంటే? పానీలె, మొంజోడని కాత్తె సరసంగానే 'ఒరె, యిట్టాగామరా' అన్నా. 'వుం డాతల' అన్నాడు. యీడికి తరబీదచ్చింది యిందుకా అనకుండా. ఆడ కిదయిందీ? లచ్చనాసాంవి పదాల కాడంటే, తప్పుడుకూతలు కూసేవీ, యిన్నాల్నుండి ఆడికి నూరిపోత్తే! తప్పురా, అన్నా! 'కొత్తపద్దతి లేవయ్యోవ్' అని నాకంటే సెప్పటం? పాయదీసి మడ్డెట్టి సితగపాడవద్దంటే, కొల్లొక్కరాయి ఎదవను? 'వాయి పొవమ్మోవ్, సూశాంగాని' అన్నాడే! యీణ్ణి సారంతోటే పానివ్వాలంటే—".

"బానేవుంది, బజార్నబడి నలుగురు నవ్వేను! ఎంతగడ్డా అల్లుడే వుండే ఓకూతురూ బాగుండదనంటయ్యా, నువ్వీపన్లు సెయిటం? ఎల్లిపోతానని ఆడెందు కినాల్నొచ్చిందీ, సాగదియ్యను నాసావు ఎందుకిట్ట కావాలా! నీ యిశారాలేందో, నీ నచ్చిత్రాలు లెక్కపెట్టటాలేందో, సెవులు పిల్లాడేసుకుని ముప్పూటా కూసోటవేందో, ఆడ కూడుమటుకు కాసుక్కూసోలేదు, సెప్పొద్దూ! తిరిగి నన్నాలు తిరిగి మూటల్తో తెచ్చుకుని తీసుకున్నాన్నాలూ తీసుకుండావా! సేసి నన్నాలూ సేయించుకుండావా, యిగ కాల్లు బార్జాసి కూకుండావు దేనికీకాకుండా. నీలెక్కలేందో, నీయవారాలేందో, సంపాయించి నన్నాలూ ఓరికి దారబోశావోయామో, వుప్పుడు నీకు ఆటలంటేనే పట్టిచ్చుకోకుంటివి, ఓ సెంప మాడిసత్తావుంటె! యాలకుమటు కొచ్చి కూకుంటావు తినను, దొప్పలు సాత్తా."

"యిదుగో యిటు జూసి మాట్ట్రాడు? యీవజాన నీయవారాలేందో తేల వాల్సిందే! వుప్పుడు నా పొప్పు తెడ్డేసుకు ఎందుగ్గా నొచ్చినట్టూ? యిటు సూడూ? యిన్నాలమించీ సూత్తుండాగా మీయాటా! ఓయ్, నాంచేరు గాడ్తో యవారా లేందను కుండారో! యీడ యింకా నల్లరకతం వుందనుకో ల్సిందే, తెలవలాని యిదుగో యీసోటు నే కరీదిచ్చికొన్నా. యీయిల్లు నే గట్టెచ్చా. ఆడ కేదయిందీ? వుప్పుడు నే తీసుకుంటూ వూరక కూకుండా ననేగా నీ గెంగిరెద్దాట్టా? యీమాట విను! యీ పన్న నువు ఎల్లు. ఎల్లి పోతులూర్లో వుండ మునిసీబు కోటీస్పర సాములోర్నవుతే ఏం, ఆడుండే వోర్నవుతే ఏం, ఎల్లి అడాగు. నాంచేరుగాడి రావణా రావణోసుర్లోరి యుద్దెం ఏట రకతం కక్కించకీ, ఆ దెబ్బకు మునిసీబుగారు సిత్తయి బంగారపు రచ్చరేకు లెట్టిం చ్చిందీ—".

"నువ్వేనట్టా, వే మ్మటు కాదలా—".

"వుండూ—నువ్వుండాతే! యిను! అయిందీ! వృష్టిప్రాంలో వరాల్చెట్టి ముందల ఆమహాజనంలో, నే పద్మావ్యూహాంబన్ని ఆట ఆడ్తంటే, ఆట మద్దెన వరాల్చెట్టి లేనిసి, యీ నాంచేరుగాడికి పదార్రూపాలు పెజెంటు సేసి, ఏవం వ్నాడూ? పో; ఎల్లి తెల్సుకురా. వుండు — ఆయవవానంలో, పోలాయి పుల్లాయి ముత్రాలు నోల్లు తెరవ లేదంటే నీ ఎడంకాలి జోడు తీసుకు తన్ను. ఒద్దంటే ఆప్పుడను. మీసం మెలేసుకు తిరిగా! ఓయ్! వూరకె నే తిరిగా నంటా? మంగా ణ్ణనిపించుకు తిరిగా! సంపాయించా. అట్టాగాదంటే, మీాయి కులికింపే? పో, తిన్నా రనుకుంటా! కాలదర్మాన కాయలా పడ్డాను. వుప్పుడు కాకంటే మీసంచు యవారం బయటి కెల్లు కొచ్చింపే? తెగతిన మరిగీ, యీకు కాత్తె తిరుగుణ్ణపడ్తే, గోసీ లిప్పుతారంటే? యీ అక్కు— ళాయి ఎదవ ఏసత్తే నాలుగు డబ్బులు పెట్టినంతమాత్రాన ఈడ, ఆసలోడు అడదయినట్టంటే? యిదుగో, యీదాకపోస్గు ఆట్ట ఒదిలేత్తా, ఆడు బెట్టిన కానీ కాసులమీాన. కాలె ఎడం తగిలేతలికి, ఒక్కోల్లకు నడువులు సల్లోదిలి, పత్తేసుకు బతకాలంటే పడిసత్తారంటే? మిటకరిత్తా, పొప్పు తెడ్డేసుకుని ముగుసుకుంటా ఒచ్చా? పో అవకాడకు. యిది ఎప్పటికైనా నుప్పు తున సుకోల్సిందే!"

"అచ్చి," అనో తుమ్ముతులి ఏసి దొగ్గలాకు పప్పుకూర కాడికి దొల్లుకుంటా ఎల్లింది యీరి.

*　　　*　　　*

ఎగ్రపంచకట్టాడు. పైన గళ్ల కండవా మడ్తేశాడు. గొబ్బిచ్చిప్పుడు బట్టించి, ముంగలజుల్పాలు, ఎనకజుత్తుముడి అనగ దువ్వాడు. సెవులకు కమ్మలు, సేతిన బెత్తం, కాల్లకు కిర్రుసెప్పులు, దూలవాంచలె తాటితంబవాంచలె వూల్లోకి బయల్దెల్లాడు నాంచేరు.

"ఏం నాంచారమ్మోవ్, కాత్తె సుమారుగుందా?" అనో మంగలాయిన. "వాసి, నాంచారయ్యోవ్!" అని అల్లమ్మతో ఓ కుమ్మరమ్మాయి. "ఏం గుర్రగమ్మోవ్, బాగుండా?" అనడిగాడు నాంచేరు తలుపుసాట్నుండ ఆ కుమ్మరి మడిసితో. "ఆ! కాత్తె, నయంవేనా?" అందా మడిసి తలుపోరగా సేసుకుని. "ఆ, మల్లీ కనిపిత్తాగా!" అనేసి ముందుకు నడిశాడు నాంచేరు. "మల్లీ పీరు బజార్న పడ్డదే!" అంటూ నోతాచ్చాయిబు.

"ఏంరోవ్, నాంచేరూ. బాగుణ్ణేవా?" అ నెంకెట్సుబ్బయ్యగారు అని ఓవిదానేంటి, ఆనాటికి మల్లీ నాంచేరు నాలుగు యీదులా నలుగుర్నీ సూత్తా, పూరాసన సందులుగొందులా పీలుత్తా వుసారుగా తిరుగుతుండాడు.

"నాం చేరమ్మోవ్?"

ఎనక్కు తిరిగి సూశాడు నాంచేరు ఎవరబ్బా అంటా పక్కచ్చిగా—కడాపు పోతులూరి జంగవోం రబ్బాయిని గురుతుబట్టి, "బాగుండా వంటీయ్యా, జంగవయ్యా?"

"ఎన్నాలకు ఎన్నాలకు నాంచారయ్యా? నూశానాన్నలు కాయంగాద్దా వంటు! యీ మద్దెనే మాయునుసుబోసు నీ యిసయం అంటుంటేయినాన్న. వానిదీ నెమ్మ. నువు ఆసివర్న ఏం యుద్దెం ఆడావు, నాంచారయ్యా! యిప్పటికీ కిల్ల ముంగ లాడ్తుండ దాయూటు! ఒకపంం కెక్కుంద దన్నా రంబే నమ్మ. నాలు గేల్లు కాలేదంటా వుప్పటికి?"

"కాలా మరి! ఆడ మనో రంతా బాగుంటారుగా? మల్లీ ఎటునాన్న బయ

తెల్లక తప్పే టట్టులా. ఏపీ, యీ పద్ద పత్తిరంలేక యాడకీ కదలకనే పోతినీ !"

"యిదుగో, నాఁచారమ్మోవ్ ? యీ సంకురేత్రిముంగలగా మా వూరో పారి నూ రాల్సిందే, సెప్పొద్దూ !

"ఆఁ రాకేంసేత్తాంలే, బతికిబాగుండాల గాని ?"

"అట్టు కాదులే, నూ రాల్సిందే! అక్కడా కెందుకూ, నూకు శాలగుండావని మా మంగసుబ్బోరింటే గాలిపడగల్లా గొద్దల్లూ, మోతాచ్చాయిబుల్లిఁయాల కల్లా? హుంఁహుం! నవ్వొచ్చుద్ది వుప్పుడుకీ, ఆడాడ మీఆసిగం తలసుకుం టంటే! మీము ట్రంగంతావున్నట్టేగా ? యిదుగో, యీపనేందో నూసుకుని ఇయ్యాలే ఎల్లనూ మావూరూ ? నీకెందు కాడ గబ్బు లెగుపుతాగా !"

* * *

"ఒరే, నేనేది కాదంటూరా, అక్కులూ? కాయలాపడ్డానక పేసీలొచ్చి నె గాని—అస లెందుకు రావాలంటూ? ఎన్నాలు ఆటలాల్లేదూ, ఎన్నాలు ఓరి కోరు సరసంగా పాలేను ? ఎంతసెడ్డా, నే నీకు మావఁనేగదంఁటూ! ఒకేల రానే ఒచ్చినైరా, పేసీలూ? నేను నీకు మావఁనే కదంట్రా? పోతులూరు మునిసీబు రామని కబురుసేసె! ఎంతట్రా, నాట్రోజులు సార్బీసు యిచ్చేత్తినా మల్లీ, కాత్తె పెట్టిబడి, అసక ఎల్లి ఆడ వర్చం కురిపియ్యనంట్రా ! కాదంటా, అక్కులా ?"

"నే సెబుతున్నా యినుమాఁవా, నేనునీకన్న ఎంత సిన్నోణ్ణయినా, నా కూడా కాత్తెగేనం రాల్సిందేగా యీయాలకూ ?"

"కాదన్నా నంట్రా ?"

"నేనూ కాసినిశూసిని యిన్నిపనాలు ఆ డీడ నేర్చుకుండా నంటావా కాదంటావా—?"

"అదుగో ఆడే సరసంగా పామ్మనేది నేను. యి టిన్రా, అక్కులు ? మనం మనవంతా ఓటుంటూరా. నువు సాట్న ఎన్ని బొతికినా, ముంగల కాలీదు నాకాడే కా దంట్రా తిన్నదీ ? ఓముటా వుందంటే, ఎవుడో ఓడు గీపినగీత అవకాడకు దాటి పోగూడ్దన్నమాట. అయిందీ—".

"ఏం దా అయిందీ? లాబాలన్నీ నిన్నే గుంజుకోమనా? నాకూ పెల్లాం వుందయ్యోవ్!"

"శాశా! సంపు ఎదవను, నీ సెప్పన్లకు పాల్బుడ్తే! ఆమాత్రం ఎటునో సద్దుకోనూ? నాకు మటుకు తెలవ దంట్రా."

"ఎనక, వోపాలి కమ్మలెద్దెత్తానంటివే నాకూ?" అంది కూతురు యెంకట్చుబ్బి, సందు నూసుకుని.

"వాసి నువ్వుండే, యవారాల మద్దెన దగువాలె!" అని యిసిగాడు నాంచేరు.

"దాన్ననమాకయ్యోవ్, పిల్లముండ. దానికేం తెలవదు, అయ్యయ్యో కావాలంటుం తప్ప!" అంది యీరి, ఎంటనే అందుకుని.

"నువ్వేండే, సింతపాండు గుద్దినట్టు సెతిదానికీ? ఆ సీకట్లో కూకోరాదూ, పేడకువ్వాలె? నువ్వుం డాడ—అదిరా యవారం, అక్కులూ. ఎంతదెచ్చినా మన జనాబాకే కదంట్రా? మొదులు మనసంపాద నెంత! ఏకాడికైనా మిటామీన గురుండాల్రా, అక్కులూ. పకోళ్ళు నోల్లు తెరవను యీలవుద్దంట్రా, ఈవజానో కట్టు మీనుంటే?"

"నే సెప్పేదంతే, మావాఁ. ఎంత నీకూతురైనా నాపెల్లావేఁ గందా? దేనికైనా కరుచు మాకూ వుంటుందా, ఎంతకలిసుండా, పేసీల్లేకండాబోతే ఏనాటికైనా సుకం వుంటది."

"అదిగదీ నేననేది" అంది యీరి, యవారం ఓ యిదానాని కొచ్చినట్టు గ్రపించి.

"నాసి పాయే, పీతమొకం నువ్వూ—అంతేన్రా, అక్కులూ మాటచరుదుకు పోటుం కావాలి ఏకాడికైనా. కిరుజులుంటై నూడూ? ముసలాయిగా గుండాడు. పానీ ఎటునో సద్దుకుపోక తప్పు దెట్టా?"

"ముసలాయి డబ్బులిట బారేయ్ నేనిత్తా. ఆ తలాడు లబోదిబో కొట్టుకుం[illegible]డు" అంది యీరి బద్రంగా.

"సితిగ బొడ్డుత్తా, తంట్లా లెవారాలు కదిపావంటే—టు పేర్లంజా!"

* * *

శ్రీక్షేత్రి పోతులూరు సెరువుగట్టు దగ్గర జూవిసెట్టుకింద జనం కిటకిట్లాడ్తుండది.

నాంచేరు రాంవరావణా యుద్దం సూడను వూరి జనమంతా వుసారుగా తోసుకు నొత్తుండారు. నాలుగు సమచ్చరాల కిందట సివరసారి ఈ యుద్దాన్ని సూసిన ఈ వూరిజనం మద్దెన అంత కాలీ తగిలి, ఈనాడు పెదాసంగా మునిసీబుగారు నాంచేర్ను రావించటంలో జనం మరింత అట్టాసంగా సేరి కూకుండారు, ఆటపందిర్ని పెటపెట్లాడిత్తా.

తెరముంగల మూడునాలుగు లాందర్లు సరిది, లోపట్నుంచి, తెరముంగలకు అప్పుడే బొమ్మల్ని కాన్రానీకుండా, ఓసిన్న లాంద రేసుకుని, బొమ్మలన్నీ పెట్టాల్సినోట్ని తెరమీసకు సరుదుతుండాడు ముసలాయి, మిగతాముటాకన్న ముంగలగా కూడు దినొచ్చి.

జంగవోరబ్బాయి తెల్లరేకలు దిద్ది, తడిక సందులకుండా తలకాయిమటుకు లోనకు నెట్టి "నాంచారయ్యోళ్లు యింకా రాలే దెట్టా?" అని ముసలాయి నడిగాడు సారవున్నాడికి మల్లే.

"ఎవురయ్యా నూ, మెగానావజాన ముగ్గులేసుకు యిప్పట్నుంచీ కంత లెతుకు తుండావ్ ? ముగ్గుబుట్ట తియ్, పాంవుక్రరకు పద్దగిలే ముంగలగా" అన్నాడు ముసలాయి, పెత్తనం సెలాయిత్తా.

"ఆఁ, నే జంగవోరబ్బాయిన్లే. ముంగలగా నీ తుట్టెమొగా నొక్కపాలి సూసిపోదావంని యిటొచ్చానూ! యిది పోతులూరుగానీ, ముసిలేసా లెయికె, కాత్తె కనిపెట్టి పోవయ్యోయ్, నువు ఎవురు వోగాని, ముసలాయినా."

ముసలాయి మూలలకాడ సరిగి, తడిక సందులకాడికి ఎల్లేతలికి, అడావుడిగా నాంచేరూ, ఎనకాత్తే యీరి, ఎంకట్సుబ్బి, ఆల్ల నటుకుని ఉక్సులూ లోనకొచ్చారు, మునిసీబుగారింటో బోజనాలు సేసి.

"ఏందిరా, నూగో ఏనుగుతా పసంతా అవజాన యిడిసేసి గత్తీలు తిసుగు తుండావ్ ? మునిసీబు గారొత్తుండారు. సప్పుసప్పున కానీండి!" అంటా నాంచేరు ఆదరాబాదరా ఆట బద్దల్ని తెరమీద బొమ్మలకు పిన్నీసులు గుచ్చటం సాగించాడు, పని సంగుకోమంటూ పక్కోరికి సైగలు సేత్తా.

యీరి సల్లగా నాంచేరు కాడికి సేరి, "అట్టా కాత్తేకని బెట్టి పోనీవమ్మోయ్యావ్, దూకుడుమీ నుండావు గాని ?" అని సెవి నేసింది. "నువ్వేందే నక్కేరు బంకకుమల్లే పట్టుకుని సాగదీత్తుండావు; నీ బంగారక్క యవ్వార వేందో సూసుకో ?" అంటా తోసేసుకుని, "ఏదిది యిదది" అనుకుంటా, పనిన తవుల్లాడు కుంటుండాను, నాంచేరు వుసారు మీన.

పోతులూరు మోతాచ్చాయిబు బిసుగొడ్డం లోసకు నెట్టి, "రైట్ ! బేగి కానిచ్చెయ్ నాంచారయ్యా, మునుసుబ్ కీ వొచ్చి కూకుండార్" అని, ఆ యిసయం మునిసీబుకు సెప్పి, ఆరి ఆడరు పెకారం అల్లరి సిల్లరజనాన్ని ఆడిసి తట్టి, తెరముంగల నిలబడి యీపిదంగా సెప్పాడు :

"మల్లీ నాల్గుసమచ్చరాలగ్గాను ఈ నాంచేరుమిటా రాటం అయిందనీ, మునుసుబ్ గారు, యింకా పెద్దపెద్దోరు ఆటసూడను సెత్తేకం గొచ్చారనీ, కాత్తె పిల్లల్లోసదయి గ్రానీకుండా సూత్తా, యుద్దం మొదలబెట్టబోతుండారు గనక, బద్రంగా వుండాల్సిందిగా మునుసుబ్ గారు సెబుతుండారో హో!" అనేసి తనసోటు కెల్లి కూకుండాడు, తెరిపిగా తెర కాపడ్డా.

బయాటతట్టు లాంచ గ్లాస్పయాటం, లోపడ దీటీలు ముట్టియటం ఓపాలే జరిగేతలికి, యుద్ధానికి ముంగలగా యీరికంటంతో బాటు, ఆడుకుంటా బంగారక్క పెత్తెచ్చమయింది తెరమీన..

"ముక్కు సూడు ముక్కందము సూడమా; ముక్కునుండా నాముద్దు పోగును సూడమా. బంగారూ నా పేరు సుంగారవతీనమ్మా, బామలారా.

"గొప్పపెబువు లుండాను బంగారక్కా. సెయ్యెత్తి దండంబెట్టు బంగారక్కా. మిమ్మల్లందర్నీ ఆదరించి ఈయాటనే యిత్తుండ, శ్రీ మునిసీబుగార్కి అనేక పెమానాలు సెయి బంగారక్కా.

"ఆ నాయిదంగా సబోరిని యిశారించి, ఆటలాడి, పాటల్పాడి, అల్లుడు కేతిగాడ్కి రావణాసపణా యుద్దం సూపించను, మొగుడు జుట్టు పోలిగాడు రాకతలికే, కేతిగాణ్ణి ఎతుక్కుంటా బోయిందిబంగారక్క సింగారముగనూ."

యింకా సేపుటికి మరికొన్ని దివిటీలు ఎలిగి నాలుగుపక్కలా ఎల్తురు సద్దుకునేతలికి, మొత్తం యుద్దభూమి కిల్లకా పడింది. యిటుపక్కగా,

శ్రీరాంవులోరు, లచ్చనాసాంవి, ఆంజినేయుల్తో కలుపుకుని కోతిమూకలూ, అటుపక్కగా రాంవణాబ్బెమ్మా, యిబీసన కుంబకర్నుల్లాటి రాచ్చసమూకలూ యుద్దానికి తయారుగా వుండారు, సెలనం లేకండా, ఎనక దివిటీల ఎల్తురు ఒకే దుష్టితో మెరుత్తా.

యుద్దానికి తయారవుతా, వుసారుకు సిందుల్తొక్కుతుండ నాంచేర్ను యీరి సల్లగా సవరదీత్తా "ఆడాడ అల్లుణ్ణి కనిబెట్టా, అణ్ణేం అనక, కాత్తె ఆణ్ణో సుమారుగా పా వయ్యోవ్," అని మల్లీ అదిలిచ్చింది.

"వాసి, నువ్వేందే నాకు, ఆరంబం కాడా ? ఆట సుమారుగా పాకపానీ, మీ ఒల్లు నారదీత్తా."

"నువ్వు ముంగలగా తూలమాకయ్యా, యిదేందో పెద్దరంగా వుందీ !"

"సెక్క యిరుగుద్ది! సుబమా అంటా—నా కసలే తిక్కరేగుతుండది, పాణ్ణాంచి. వోరె, అట్టు నీలుకారుత్తా నిలబట్టా వేందిరా? పోయి, రాములోరి ఎంగ తేందో సూడకా?" అని అక్కుల్ను ఇదిలిత్తా, తనెల్లి రాంవణాబ్బెంవను పట్టాకు, కాల్లకింద లయసెక్కను సరి చూసుకుంటా.

అక్కులు గంబీరంగా పెల్లాం ఎంకట్చుబ్బిని దెగ్గిరగా వుండమని సైగ సేత్తా, ఎల్లి రాములోర్ని బట్టాడు, కింద సెక్కను వాలుగా సూసుకుంటా.

డబ్బాలు డబడబ లాణ్ణాయ్ ! సెక్కలు కటకట్లాణ్ణాయ్! "అహాహాహాహా! వువ్వోహహోహోహో! యీక్లి యీక్లి!" అంటా యింతకారం సేశాడు నాంచేరు, ఆటపందిర్నీ, అక్కులాయినీ ఒనికిత్తా.

యుద్దెం ఆరంబవయింది.

"హే సీరామసెంద్రా?" అని కాలికింద సెక్కను తపీమని లయగా తొక్కాడు నాంచేరు.

"హే రావణా!" అన్నాడు అక్కులు కింద కాలు లెగవక.

"సూటు సోట్టంగ రానీ, ఎదవా—నీకు సీతామ్మోరు కావాలా సీరామ సెంద్రా ?"

"కావాలి, రావణా ?"

"నా సెదవా, జావగారుత్తావ్ నోటెంటా ? యిగబోడుత్తా సాంగ

గార్భావంటే. పా ఆతల్కి—రావణోర్ని పట్టు" అని అక్కులాయిని రావణోరి కల్లి సెట్టి, తసెల్లి రాములోర్ని బట్టాడు నాంచేరు.

"ఏయీ రావణాబ్బేమ్మా! నీకు నరకంలోకూడా తావులేదోయీ!"

"నీకు యాడాలేదు."

"యిను? నా సీతామ్మోర్ని నువు సెరబట్టావు?"

"నాకు శానా అగసాట్లగా వుంది."

"మాట కరకట్టుగా రానీ, ఎదవా—యిఁనిను సచ్చినా యిసువను రావణా!"

"నువు అన్న్యాయంగా సత్తావు, సీరామా!"

"ఆఁ ఆఁ ఆఁ!"

"యియ్యి హి హి హు హో!"

"జూటాకోరెదవా, నూ నాకాడా!" పెల్ మంది అక్కులాయకి. సెక్క—లెగిసింది అంతరిచ్చానికి—తోసుకుని రెఁడయింది నాంచేరు సెత్తిమీన—కూలి పొయ్యాను యుద్దెబూమిన. రకతం కక్కింది యుద్దెబూమి—కీసుమంది ఈరి కంటం. తడికసందుల్న జంఁ మోరబ్బాయి జావై పొయ్యాను.

# కోటయకొండకు

శివరాత్రి దగ్గిర కొచ్చింది. వాత్తీపెకారం పత్తిపూడి ఆసాములు సెబ సెల సెలల్మీద తయారై పోతుండది.

మండిగానికి బొంగులుబాతే ఒడ్రంగయ్యలేనా, సీలలు దిగేసే కమ్మరేనా, కొసలు బిగిచ్చే కుమ్మర్లోరేనా, రంగు కాగితా లంటించే ఆరీ రేనా! ఈ రంపర్ని వుసిగొలుపుతా పై పెత్తందారీసేసే సౌదరయ్యలూ, ఆరేంది యీరేంది, కాత్తెకోరవైనా, పత్తిపూడి మొత్తంజనం సెబకాడ యిరగబడి పోతుండారంటే, కోటయకొండ కోటేస్సర్ల మాత్తెం అనుకోల్చిండే.

"కోటయకొండకు నూ రావంట్రా కోటయ్యా?" అనడిగాడు ఓ పెద్ద సౌదరయ్య, సెబ కాడికొచ్చి సూత్తుండ కోటయ్యను.

"రానంటుండి మరీ!" అన్నాడు కోటయ్య యికిలిత్తా.

"సెబకో కోపు గాత్తావా?"

"కోటయ్య కోపుకాయంది సెబ కదులు ద్దంటుండీ!"

అ నావిదాన కోటయ్య అన్నాడేగాని, పెల్లాం రాం సుబ్బమ్మతో పేసీ గుంటదని తెలవక పోలా.

* * *

"చరేగాని రాం సుబ్బమ్మా? నూ మటుకు రావూ కోటయ కొండకూ? తమాశగ ఎల్లొద్దాం?" అంది పక్కింటి ఎంకమ్మ రాం సుబ్బమ్మతో.

"నే మటుకంటే, వోరో రెల్లుండారేం?"

"చరేలే, యింక నూ నిదగ్లో వుండట్టుంది! సుక్కమ్మక్క ఒత్తుండే! రాగమ్మత్త ఒత్తుండే! రాగా పోగా మీ ఆయనే వూరికి ముంగలగా బయెల్లుండే, ఎవుసమటు కెందుకు పయానంగారూ?"

"ఏంచీ! యీనకొండకు బయెల్లాడా ఏం? చరేలె! ఓసోటికి బయెల్లడు గనకా, సానీ యాడకు ఎల్లడను కుంటానికీ! మొదులీ కొండయ్య కద లకపోతే కోటీస్సరసామి ఏమనుకుని బోతాడూ.!"

* * *

ఆ ఏటి చివరాత్రి వుసారు ఎవురిమీన గెల్తుందదంటే, మెహరీలో వుండ నాగారుబొమ్మ గు డెనకాతల, వూల్లో వుండ కాత్తే నుమారైన పిల్లజనాన్ని కలుపుకొని, కోటయకొండకు పెబ గద్దండ కోటయ్య కొడుకు యాగ వులు మీనగా ఎల్తుండ దనాల్చిందే.

"నూాడా? వుసారంటే యాగ్రాగవు ద్దిరా!" అన్నాడో పిల్లాడు.

"దర్శరబలు ఎగపడరట్రా మనం పెబను కొండకు నడిపిత్తంటే!" అనింకో పిల్లాడన్నాడు. "వూల్లో ఆసావుల పెబ దీని ముంగల బలాదూరు కాదంట్రా!" అన్నాడింకో పిల్లకాయ. "మీ అయ్యకు తెలుసంట్రా నూ కొండకొచ్చేదీ?" అని యాగ్రాగవున్నడిగాడు కాత్తే సుమారైనో పిల్లకాయ.

"మీరు పని దబ్బున కానీంట్రా? అల్లచంగతి నే నూత్తాగానీ!" అన్నాడు వుసార్లో యాగ్రాగవులు.

"పెబకు మీసాయిట్లో వుండబద్దలన్నీ యిసుక తెత్తినిండా, తెలుత్తే మొగ్గలేయించ దంట్రా నిన్ను?" అన్నాడో పిల్లకాయ.

"ఆఁ, యిట్టాటివి లచ్చలు నూశా! మీరు నూత్తుండంట్రా! సౌదరమ్మ గారి పొల్లెళ్లతో మన పెబ కోటేస్వరసామిని ముంగల నూడక బోత్తే!"

'దర్శరబ శరబ' అని అరిశారు పిల్లజనమంతా ఓపాలిగా.

* * *

"ఏందయ్యా పెట్టెలన్నీ గాలిత్తుండావూ!" కోటయ్య నడిగింది పెళ్లాం రాంసుబ్బమ్మ.

"చివరాత్రి వత్తం లేదంటే! యాడేడో చిలుక్కుండవా వుండాలే.?"

"చిలుక్కుండవా చంగ తట్టుంచు! యిటు నూడూ? పెబకు పగ్గాలు పడ్డావంటగా.?"

"ఆఁ, సౌదరమ్మ లడిగాడూ! బాగుందే, ఎల్లాల్సొత్తే ఎల్లక్కర్లా?"

"యాడకీ యెల్లేదీ?"

"కొండకు లేవే!"

"కొండకూ? మరింటికాడో యంటూరూ?"

"ఒరూ? మీ యండారుగా?"

"వూళ్లో జనవంతా కొండకు బోతంటే, యీడెవురుంటారూ? ఎంకమ్మాల్లతో నేనూ పోతుండా."

"పొయ్యావులే! తొక్కిళ్లుబడి జనం సత్తంటే, ఈ ఆడముటా యాడకో ఎల్లుద్దంట్రా!"

"సాల్లే! మా నాగంగా బయలెల్తుండావు గాని! పెతి ఏటా ఎల్తుండావుగా? యీపాలి యింటికాడుండ్రాదూ?"

"నాకు తెలవదూ! ఎప్పుడన్నా నీకాడ నలుగుణ్ణ పడందే కొండకెల్లానంటా?"

"నూ లచ్చ సెప్పుగానీ, యీపాలి నన్ను బోనీ?"

"రాగవులు యింటికాడుంటాళ్లే."

"నూ నాకు ఎంటేం వుండక్కర్లా గదవాయిత్తూ.!"

"మీ ఆడజనం సేరి ఆడేవో ఆడ్డావనుకుండారు కావాల్నా, ఎంటుండి సే సూత్తా గా మీ యవారాలేందో!"

"సాల్లే మొగోడివి బయలెల్లావు! మొదులీ రాగవులేడీ? పొద్దుపొడిసిందవగా బూది సెల్లాడూ?"

"ఏడీ సిడిపో తెదవా.?"

"సాయిట్లో బద్దలన్నీ యిరిగుండై! పెద్ద బొంగు అగుపీటంలా!"

"ఓరి సిత్తకార్తి పచ్చి! ఏడీ యదవా, నారదీ సెయకా! యాడన్నా పెబలు కడ్తంలేదు గందా!"

"వాడేం మాత్తెంలో వుండాడో!"

* * *

చివరాత్రి మాత్తెం ఘుమ్మ్మ ల్లెగుత్తుండది, కోటయకొండ దారిపొడుగునా. ఓసిన్న తెర సాపలాంటి సిన్నపొట్టేళ్ళ పెబ, దార్నబోతుండ పెబల్నీ జనాన్నీ దూసుకు పోతుండది గులాంవులు లెగుపుకుంటా. ఎనకా పిల్లజనం వుసారిత్తుంటే పెబకు ముంగల మడిసి గురుతులేకుండా ఒల్లంతా గులాం నిండి, 'శంబ దళ్ళరబ' అనరుత్తా, సేతిలో ఎదురుబెత్తం తిప్పుతా, ఈరుద్దల్లే ఎల్తుండదో పిల్లయి ప్రవాం, యీ రాగవులుకు మల్లే.

# పెళ్లి

కనకయ్యా పెద్దకూతురు బూసమ్మ పెళ్లి ఆ రేత్తిరికి. మూర్తం సానా పొద్దు పోయినాకయింది. సుట్టాల్జనంతో కిట కిట లాడ్తుండది పెళ్లి ప్రదేశమంతా. సీకటెక్కువవుతున్న కొద్దీ ఏపనినా తెరిపినపడక కనకయ్యా, పెళ్లాం పార్వతమ్మా, కాత్తే ఆరిర్ని బతిమలాడుకుంటా పన్లు తొందరగా కావాలంటా, ఆ గుంపున గలిబిలిగా తిరుగుతా ముక్కుకు సీదరబట్టి యీయానా, గొంతు బొంగురుబోయి బరకనబడ్తా, దగబరమంటా అయిడా, సొంతపనికిమల్లె సే సాయపడ్తా ఎడా పెడా, ఆడా మగా తెలవకుండా కత్తీసబడ్తా, ఒతిమాలించుకుండ పనిమంతులూ, ఎవురిమాటారికి అరదం కాకండా గుంపుమయాన గడ్డొచ్చిపడ్డ కాకుల కీసరబాసరకు మల్లే "యీ గంగాలా లాడబెట్టు. ఆ సాపలందుకో. సన్నాయి కర్రోళ్ల సంగతోరికి పట్టదేం? సూడండి పెళ్లి కూతు రేడుందో? మొదులీ కనకయ్యా కాన్రాడేం?" అంటా పనిమంతులు సుతులెట్టి సీనారేకులు పెల పెల్లాడిత్తా నూర్పిడి సేత్తుండారు పెళ్లి ప్రదేశమంతా.

ఆ సందట్లో పిల్లసంచుకు ఎంత పెత్రేగటానికి యీలుండా, కనకయ్య తమ్ముడు బుగ్గమీసాల రత్తయ్య, యీ సంచు నో కంటకని పెడ్తా, ఆ అందిన పెపినీ, యీ యీలుగావుండ యీపునూ సవరదీత్తా ఆడీడా మసలటంలో, కాత్తే పనిజనానికి పెడగావుంటూ ఒచ్చారు కుర్రకారు.

కనకయ్యా సిన్నకూతురు నాగరత్తి, సాకున పెరిగిన మేనల్లుడు కాంతం, యింతసందట్లోనూ, అనుకుండ పెకారం సేహితంగా జోడు సీలకండా, సొంతింటి సందరబ మవటంలో, రత్తయ్య పోకడగ్గమనిత్తానే గంగాలా వాయిత్తుండారు సాటుసాట్న. ఓరవిలుబండా లేనా, గుర్రపుసారీలేనా, కొబ్బరాకుల టుపాసు లేనా,—ఆత పెట్లబోలి దేనికో! ఆస్లకాత్తా సూసి, తా టోలుత్తామంటా— ఓ గెంతులేనా, ఓతంబాలాలేనా. ఆడ్తాఆడ్తా, 'యీక్'మని పేరంటాల ఎంకటసుబ్బమ్మమీన యిసుకు పడ్డాడు కాంతం, సేతిలో వుండ పాసుప్పళ్లేన్ని అయిడ, తనమీనా సిందకొట్టుకుంటా,—"మాయదారిసచ్చినోడా!

యీడ దాపరించావురా మిడతలాగ!"-ఇంకా సుబ్బమ్మ సగమన్నాయిప్పంగనే, యేణ్ణించి ఒచ్చిందో, ఫెటీమని కాంతం ఈపుమీనపడ్డది రత్తయ్య సెయ్యి—ఒళ్లు సలపరించి, అవ్వాయిసువ్వమల్లే ఒక కేదూకు దూకాడు, సుండోల్ల కుక్క లాగ యీడ పరుగుంటే ఆడకి.

యీపు సురసురమంటుండా, తెలవక తను దూకిన దూకుడుకు, సుబ్బమ్మ గేదపడ్డకుమల్లె బెదిరిసేసిన యటకారానికి, నవ్వుకు రొప్పుతుండ పొట్టతట్టుకో లేకపోయింది కాంతానికి, యీపు రుద్దుకుంటుండా.

తక్షీమని పిడతపగిల్నట్టు జరిగిన యీయవారమంతా, తంబంసాటుకు సేరి సూత్తుండ రత్తి, కాంతం ఎటు లగెత్తిందీ తెలవక, పిల్లికూనాలె సీకట్లో తవుల్లాడ్తా, గొడ్డసావిడి మొత్తకాడి కొచ్చేతలికి- మరింతపగలబడ్డాడు రత్తిని సూసి కాంతం. తనూ నవ్వాపుకోలేక, దబుక్కున నోటికి సెయ్యడ్డం పెట్టుకుని "వుప్ వుప్" అంటూ పొర్లాడుతా యిరగబడ్డది కాంతంతోపాటు రత్తి కూడా.

"అదేందిరా—యిహ్, యిహ్, యిహ్-సుబ్బమ్మ మీన-యిహ్-అత్తా యిరుసుకు పడ్డావూ? యిహ్హీ—"

"హి, హి, హి, బలే, హి హి, పొసుపంతా నెత్తినబోసుకుని—యిక్—ఒకా టాడింది సూసుకో! యిక్—"

"రత్తియమ్మబాబాయిరాటం నేసూత్తు నేవుండా—యిప్—యిప్-యీపుమీన—ఫట్—ట—టపా కాయ—" మల్లీపగలపడ్డది రత్తి నోటికి సెయిసాటు సేసుకుని.

కాంతానికి ఒకపాలి యిప్పుడుగా దెబ్బసురుకు సురసుర మరింత పైకి లెగెసింది. రత్తి యిందాకిటాల్నుంచి ఆపగలబట్టం తను తిన్న దెబ్బకని తెలుసు కున్నాక బిగుసుకుపొయ్యాడు బాద మరికా తెక్కువై.

"ఎంతుకమ్మా అంతనవ్వు? నాకేం తగల్లా దెబ్బ."

"వూహూ, హూ, హూ—వుత్తిమీద దుత్త పగిల్నత్తు పలుగుతె—యింకా-యిహి-యిహి-"

"ఎంతుకమ్మ అత్తా పడి కొత్తుకుంతావూ? పాపం కల్లనీల్లగావుంటె కాదన్ను?"

"ఇది కాదురా, కీసుపిత్తాలె అత్తా లగెత్తుతే- యిహీ-వుప్-"

"నీకు కాలా కాత్తి? అనాడు సాతుగా వులవగుగ్గిలు బొక్కుతుంతే—మాంవసూసి—సెవులు పిండుతుంతే—కీసు కీసు మంతా ఎగిత్తివే లబ్బరి బొమ్మాలె! ఆ తిమ్మిరి తిమ్మిరి ఏకాడికి వదలకపాయనే!"

"వొప్పుడమ్మా?"

"ఒప్పురా! తెలవదేం, పాపం? దూడకు మల్లెగుగ్గిలు తింతం ఏందే, ఈపా లాపడు తోలు తీత్తా, అన్నా అప్పుడు మాంవా?"

"[మెటికెలిరుత్తా] పానీలే, పాపం! నీకడుపు సల్ల పరిందిగా! పానీలే—ఈపు రుద్దుకుంటా."

"నేనేం రుద్దుకోటం లా! మొదలు నాతో తంబాలా తెందు కాదా?"

"అత్తే మటుకు సుబ్బుమ్మమీన పడమన్నా రెత్తా?"

"నేనేం పల్లా. పాపం సెప్పనన్నా సెప్పలా, ఆ డొత్తుండాడని సూత్తా నుంచునీ!"

"ఎత్తాగయ్యా? మొదులు—యిహ్హి—"

"యిక్ యిక్ మంతా ఎందుకత్తా పడి సత్తావూ? వుండు సెప్తా నీపని! ఈపాలి రమ్మనవూ? 'దారా ఆరుకుందాం' అని కోతెల్లే! అప్పుడు! నా దగ్గిర సెక్కెరాలుండై నీకు పెత్తనే!"

"యాడియిరా! ఎవు రిచ్చార్రా?—పానీలే."

"పానీగాక రమ్మన్నా రమ్మాయిగార్ని, కిసకిసమంతా యికిలిత్తా?"

"పానీలేరా. ఎవురిచ్చార్రా సెప్పమంతేనూ! ఈపాలి నవ్వనుగా. పానీలె, నా కెవురూ పెత్తరు."

"అబ్బో! ఏం నంగనాసివే! నువు నా కెప్పుడైనా పెత్తా?"

"పెత్త లేదయ్యా? వుండు నే బూరితెచ్చుకుని నీ కింతన్నా పెత్తా నేమో సూడు!"

"ఆఁ యిత్తారు పో గరిటె తీసుకుని."

"ఫా అతలికి! సూడమ్మా ఎత్తా ఒత్తున్నాడో యసకెమాలె! అయ్యో సక్కదనం!"

"కామత్తే ఒత్తుండా."

"ఎవురు పెత్తల్రే ఆసి పత్తుండావు గాని!"

"చెరిచ్చొగం."

"ఏందీ?"

"కాత్తె, కాత్తె."

"అనుకుంతుండు, నాకేం?"

"సక్కదనం—"

"అం—!"

"నారి—అయ్యో—"

తవ్వల్లాడును సేతలికి ఎటు లగ్గింద్తో, బాగా గిచ్చి—"సిలిపిముండ, అను గుద్దిరానీ!"

* * *

పెళ్లిపందిట్లో ఆడావుడి ఎక్కువై పోతుందది. ఆ సుట్టాల జనం అటూ యిటూ తిరుగాడ్తుంటే, సన్నాయి కర్రాయిన, 'సూడుపిన్నమ్మా' పాట మాలయాగా యిసుర్తుండాడు ఏలుముడి డోలాయిన వుసారిత్తుంటె. బాకం లూదే ఆయిన పార్వతమ్మ గరగరమంటూ ఆ పద్దప్పుడల్లా, మడిసికి వూపిరి పోతున్నట్టు, గొట్టం ఆ ఏపులకు బారుసేసి, గింకారం పెట్టిత్తుండాడు పోలీ సాడితుపాకిమల్లె వుండ ఆ పొడుగాంటి బాకాతో. పెళ్లోరు తరలిరాను కాత్తెపొద్దుపోయినప్పటికి సంటిపిల్లకు పక్కలు ఆడీడ యింకా సరదకుండా నే జరిగిపోతుంటమే కాకుండా, పెళ్లి పెదేశాన్నంతా కలకల్లాడిత్తా గేసునెటు దీపాలముంగల రంగురంగు శాపలాలె తిరుగాడుతుండారు పెళ్లి కొచ్చిన ఆ రీరు.

బుగ్గ మీసాల రత్తయ్య పెపెత్తందారీ సేసినంతమటుకు సేసి, అప్పుడే కాత్తెసెయి తెరపిసేసుక, 'యిస్' మనుకుంటూ అట్టా ఓమూలగా పందిరి తంబంకింద ముడ్డానించాడో లేదో—రత్తి ఎటు పోయిందాని మూలగావుండ ఆ తంబాన్నే ఎక్కి సూత్తుండ కాంతం, రత్తయ్య తంబంకాడికి రాటంసూసి ఒనుకుపుట్టి కల్లుతిరిగి జర్రున జారి తక్షీమని, ఎత్తి పేడతట్ట బోల్లించినట్టు

రత్తయ్యమీన కువ్వకువ్వగా పడ్డాడు. యాడవో వడ్డబత్తాలుజారి నెత్తిన పడ్తున్నట్టయ్, అంత మడిసి ఆ వజాన దిమ్మరబోయి, కాత్తె తెప్పరిల్లి ఒల్లు దులుపుకుంటా ఎగిరిపడి నూసేతలికి వడ్డబత్తాలేడ కానరాకపోంగా, వూరికే సన్నాయి కర్రాయినకు ఎక్కిళ్ళు పుట్టటం అట్టావుంచి, దారెబొయ్యే పేరంటా లెంకటసుబ్బమ్మ, కాలీ కిర్సనాయిల డబ్బాలబండి బోల్తాకొట్టినట్టు నవ్వుల పెల్ల లూడ్తుంటే, కండవా దులుపుకుని సీదరించుకుంటా, "తొండెదవ, ఆడ్నే! శాపగొడ్తును అందినట్టయితే" అనుకుంటా యవారం తోసేసుకు పొయ్యాడు రత్తయ్య ఆతల పనున్నట్టు.

కాంతాన్ని గిచ్చి లగెత్తికెల్లి రత్తికూసేపు అటీటు తారాడి అప్పు నాయుడు సాయ్యులకుపోకుండా, ఓమూలగదిలో కూసుండ, పెల్లికూతురు బూసమ్మక్క కాడకు సల్లగాసేరింది, యిడిసేనిన పిల్లికూనకు మల్లే.

"యిదేం పెల్లెమ్మా! ఏ కాడికి తెవల్లకుండా!" అని సనుగుతుండగి— బూసమ్మ ఒంటిరిగా సిరాకు పడ్తా.

"అక్కా క్కా, ఏంవన్నా తంతానికి పెత్తవే?" అంది రత్తి ముద్దులు కుడుత్తా.

"యిదేం పిల్లమ్మా దీని కెప్పుడు నోటి దూలేను! ఓపక్క పెల్లెం దుబ్బ గాబర పుట్టి సత్తంతేను!"

"మరెంతుకమ్మ సేసుకోతం?"

"పాయే, నీదంతా ఓ పిల్ల సాద! గాబరాగా వుండ దెట్టా మరి?"

"ఎంతుకమ్మా గాబరా?"

"పా ఆతలికి, యిసారించ నొచ్చావుగాని, మొగుతే బయంగావుంది నాకూ"

"ఎంతుకమ్మా అంతబయం? నా మొగుడయ్యా బాగుంతాడని సెప్పుతుం తుంతివే అందర్రో?"

"నాసంగ తెరగవు రత్తోయ్! ఫో. ఎల్లి ఆకోతి కాంతాయి కాడ కూసో."

"నీ మొగుడే కోతి. నన్నంటే అసలు పణ్ణునేను—"

"ఓలమ్మో! దీనికెం తభిమానంవే! యిగముందు మమ్మన్ని బతకనిచ్చేద్దా! ఎంతెనకేసుకు రాటం!"

"సాల్లే బుత్తబొమ్మాలె సింగారించుక్కున్నావుగాని అవుద్దిలే పెళ్లి"

"ఛత్తోయ్, నాసంగతెరగవ్, పా ఆతలికి"

"నాకు బూరి పెత్తు"

"నే నీడేంకువ్వే సుక్కూసోలా బూరిలు, అమ్మసూత్తే సంపుద్ది."

"ఆఁ, యాడో వుంటై. నాకు పెత్తూ!"

"అన్నీ యిప్పుడే కాజేత్తుండావని సరకరూ, తెలుత్తే!"

"ఎత్తా తెలుసుద్దమ్మా, నే ఎవుర్తో సెప్పనుగా. అసలే డమ్మా వుందీ?"

"యీడే వున్నాయిగాని, ఎవిర్తోన్నా సెప్పావా, సీలుత్తా"

"యీడపెత్తుకుని అన్నీ తింతూ కూసున్నా, యింకా బయం దేనికమ్మా? నాకు ఓతి, రెండు, అన్ని పెత్తు"

"అరవమాకే! సీలుత్తా."

"యింకోతి—ఆ ఒక్కతి సాలే!"

"నువ్వేడ దాపరించావే, కప్పలాగ! యాడన్నా సాటున తిను. సంపుతా తెలిసిందంటే."

బూర్లను పరికినీసివర్న భద్రంగా సుట్టి, పైకిలాగి బొడ్డో దోపుకుని, వోనీ పైకి లాగి, మొగం గాబంతై బయిటుపడ్డది రత్తి ఒల్లు కులికించుకుంటూ.

"యీన అవుపించాడా, యీ నవుపించాడా" అంటూ కనకయ్యకోసం, వంటిల్లంతా దేవులాడి గొంతున రవ్వబలుకుతా ఒత్తుండ పార్వతమ్మ రత్తి ఆత్ర పెవారం సూసి, "ఓసి నీయిల్లు సేలగట్టా! యీ సాయిల్ని దేనికే తిరుగుతుండావూ? ఆ కాంతాయి ఏడీ? ఆరత్తయ్య మరిదిమీన పందిరి తంబంమీన్నుండి దూకాడంట! పందిరిమీన వాడికేం పనొచ్చిందో! యిదేం పిల్లలు! పెళ్లోరొచ్చి 'యీ పిల్లలేందీ, యీ యవారమేందీ' అంటా నవ్వి పోరూ? మొదు లీయన కాగ్రాందే! యాడ సుట్ట కాలుత్తూవుండ మడిసికి అడనే సరిపోతుండె! బానే వుందీ యవారం. యీడేంచేత్తూండావే నువ్వా? ఆ పరికినీ పైకి దోపుకోటం ఎందీ! ఆకల్లకటికేందీ! ఏందీ అవతారం? ఏదీ యిట్రా, కొత్తపరికినీ అట్టా పాడుచేత్తుండావు—ఆతల పనుంటే—"

"వత్తానుండే! కాల్లకడ్డం పత్తుంతే పైకి దోపుకున్నానూ! వత్తాలే నూ పా."

"ఏం అడ్డం పడదు వూడదియ్యి ముఁదు. అసియ్యంగా ఓరన్నా సూత్తే ఏఁవఁనుకుంటారూ? తియ్యి ముందు—నువ్వూ—"

"తీత్తా వుండే—"

"బొడ్డో ఏఁవుందే, సేతు ఈడ పెట్టుకుంటావ్వూ? ఏది సూణ్ణీ?"

"సూపిత్తానుండే—మరే—ఒద్దన్న కొద్ది బూరిలు పెట్టిందే ఇది—"

"బూరి లేందీ! నీ కెవురు పెట్టారు?"

యీ జాతరంతా తలుపుసాట్నుంచి యింటుండ పెళ్లికూతురు బూసమ్మ తల బయిటికి పెట్టి గుడ్లురుఁవుతా 'సంపుతా'నని సయిగ సేసింది రత్తికి.

"ఇదుగోనే—సూడమ్మా సంపుతాని ఎత్తా బెదిరిత్తుండదో!"

పార్వతమ్మ ఇటు తల మలిపిందో లేదో, సందు దొరికిందే సాలని గొడ్డ సాయి దేపుకు లగెత్తింది రత్తి రొప్పుకుంటా.

పెల్లని పాతసాఁవా నంతా గొడ్డసాయిట్లో ఏసి గొడ్డను యింకోసోటికి తోలటంలో కాత్తె కాలీగా వుంది సావిడి.

రత్తి లోపలకు సేరి తంబం కాడ కూసేపు కూకుండాఁవని సీకట్లో తవ్వుల్లాడ్తా—రత్తయ్య మీన కుత్తీపట్టొచ్చి, సా పోటి సఁపాయించి కూసు నాలోసిత్తా వుండ కాంతంమీన గబాల్న పడ్డది 'కీక్' మంటా.

"పానం తీశావు కదంటె! ఎవురో అనుకుని పీసుపీసుమంది పానఁ!"

"నువ్వే నంతరా, కాంతం—" ఆ పడ్డబయానికి గబాల్న కాంతాన్ని వాటేసుకుంది ఎగరొప్పుతా.

కూసేపుటికి ఓరికోరికి జరిగినవి యిద్దరూ సెప్పుకుఁడారు యిఁతింతగా.

"యియిగోన్రా, బూరిలు. యిద్దరం తిందాం సక్కగా యీడ కూసుని."

"అబ్బ! యాడియే?"

"సూశా, సూశామ్మా, అన్ని లాక్కుంతా! అంతుకునే—"

"యిందాక గిల్లీ!"

"మరి నన్నెందుకమ్మా, సక్కఁదాన్నని, నాత్రినసీ అంటఁ? సూడమ్మా యింకా పాపం అనీ!"

"మరెందుకమ్మా అత్తా ఎగతాలి సేసిందీ?"

"నన్నా అంతివిగా సరిపోలా! ఎందుకమ్మా అంతకోపం! పానీలేరా."

"లేదు లేయే, మనం మనం ఒకతిగా."

"నువ్వు మంచోడివిరా, కాంతం! వూం, అవున్రా!"

"నువ్వుమతుకు కాదమ్మా? యింకా నువ్వు బాగుంతావు కూడా."

"పానీలేరా నీదంతా బడాయిగాని నువ్వుమతుకు బాగుందవెత్రా?"

"మా రత్తి"

"మా కాంతం"

"యింకా ఎప్పుడమ్మా బూరిలు తినేవి?"

బూరిలు తిన్నారు. రత్తి సాయిపిపక్కనుండ దొడ్లోకెల్లి బావికాడ సెంబాతో నీలు తెచ్చింది సాటుగా, ఆ నీలు యిద్దరూ తాగారు.

"నే నీక్ణే పడుకుంతా కూసేపు. లేకుంతే రత్తయమాంవ సంపుతాడు" అన్నాడు కాంతం.

"అమ్మ సంపుద్ది, నేనూ నీకాడనే పడుకుంతా" అంది రత్తి.

"నువ్వు మంచిదానివే, రత్తీ!" అన్నాడు కాంతం.

"పానీలేరా" అంది రత్తి.

"నా ర్తి," అన్నాడు కాంతం.

"నాకు కోపం వచ్చుద్ది" అంది రత్తి.

"యిద్దుకం అనుకుని పండుకుందాం" అన్నాడు కాంతం.

"పానీలేరా" అంది రత్తి.

"నా ర్తి—" గొనిగాడు కాంతం.

"కాం—" గొనిగింది రత్తి.

"........"

"పానీలేరా—" మూలిగింది రత్తి.

నిదర పొయ్యారు తామేకుంది తెలవకుండా. అల్లకు ఏబాకాలు, పన్నాయికర్రలు యినపట్లల్లా. ఎప్పటికి లెగుత్తా. రో కాంతం గుడ్డల్నిండా పాసుపు. రత్తిగుడ్డల్నిండా పాసుపు. నిదర పొయ్యారు.

# .నిదర కలత

"ఈఊర ఏసాలేసీ ఈకు డనిపించుక ఈకసారగానికె పోయినావో, ఓ గుఱ్ఱాల గోపిరెడ్డి నీగీటేమో నూడనవునా"

"ఎహే! ఎహే! దినమూ గారాబ మయితే ఎట్టా? రా ఈతలికి! ఆళ్ళతోటతో నీకేం పనీ! ఈపు సెత్తుండా బుద్దుం డక్కర్లా?"

మిగతా సలబైతొమ్మిదిమంద ఒ కెత్తూ, ఆగేడి కొమ్ముల మాలచ్చి ఒకెత్తూ. కోడెదూడ్లకుటుంబానికి సంబందించిం దవటూన-'ఎంత గారాబమైతేమటుకు, పైపలారాలు ఎక్కువై పద్దాక దొంగతిండికి యగద్దుంటే నామర్దా ఓడికీ? తోటి మందదార్నతోటిగా పోతుంటె, ఏందో మాపని వుండట్టు ఆళ్లతోటకాడే తారెట్టాడటం దేనికీ? అగ లా సుబ్బిముండ వూరకుంటదా! ఆ ఏనాదా టేందో తెలవకర్లా?'

అసలు గోపాయికి తన ఆవులమందంటే సెద్ద పానాబిమానం. బడి ఎగ్గొట్టి మందలెంట పోతుంటే, పంతులోడు నాగుమల్లె బెత్తాలు ఆవజాన ఒంటిమీన యిరుత్తుండా, మందమీన మనసు మల్లలా. సిలక, పచ్చి, గెద్ద, బెమ్మ, నీస్పెరుడూ, ఇయ్యన్నీ పలకనొల్లగాకుంటే పంతులోడు కొట్టటం ఆటుంచి, పక్క పిల్లెదవలు లేవిడికొడ్తంటే, సాటునసూసి ఒకోక్కయెదవను మడ్డబెట్టి తంతే, ఒల్లువూనం వూనంసేసి బల్లోనుంచి సాగనంపినా తనకేం సీమకుట్టినట్టుకూడా వుండలా. తనమాటంటే మందకు గురి. ఆటిని తను అగదం సేసుకోగలడు. ఎపుడన్నా కోపాన కేకలేత్తే, అలకలంటా ముట్టిలు నాక్కుంటా ఓదాని కోటి సాటుసేసుక ఓరకన్నుల నూత్తా ముద్దులు కురిపిత్తయి. గీతగీసి గుడుగుడు బల్ సెడుగుడు అంటమే సాలు, బసవడూ, కొండడూ, సంమలూ, తోకలెత్తుక చెంగనాలేత్తా, వుంయ్, వుంయ్, వుంయ్, అంటగా కూతల్లే గురకపెడ్తా, అంతా కల్చి అటూ యిటూ లగెత్తుకుంటూ ఆడుకుంటుంటే, తనకింకో పెపంచకంతో పనక్కర్లా. కోడెదూడల గోపాయని, కోతి గోపాయని, తనకు మందతోటే సరని, తన్నంటం దేనికీ? మొదులు యీమాలచ్చాంకి నోరు గుల అనగందే! అయానాద్దానితోటలోనే

వున్న రొయ్యిట్టా పరమాన్నాలన్నీ? పానీ పెద్ద ముండపోయిందే అనుకో, తనుమటుకు కాత్తె మెతగ్గా పోనక్కర్లా? ఆదుకోను రాబోయ్యాడు కూడా, సేతగా నోళ్లు తోటసాయలకిందుకు రావాలా? అ దావిదంగా మిడిసిపడ్తంటే నాకేం సెవుల్లేవా? దీని ఏనాది యవారమేందో మొదలంటు సూడక్కర్లా?

సదువుసంగతేందో తేలిపోటాన, గొడ్డకాడే పడి సావమని అయ్య సెప్పినాక, పరాయిసోట్లకు పెంటకట్టను పెద్దమందలు పోగా, మిగతా ఇంటికాడ కరుజుగ్గాను మిగిల్న సిన్నమంద గోపాయి ముద్దుకు చరిపోయింది.

ఏదెట్టున్నా ఆమామిడితోట అంకాయికూతురు సుబ్బితోవచ్చింది సావు. తనోపక్క దిబ్బలమీన సెట్టుకింద కూకుని, మంద నెమరేత్తుంటే, సల్లగా ఆ పదాలు యీ పదాలు పాటుకుంటుంటే, తోటనుండి తను కూడా ఎక్కరిత్తా పాట్టం దేనికీ? మందసాయకు రానీ సడ్డి ఎగురుద్ది!

గేడి కొమ్ములా మాలచ్చింపికి
గెంతులేసే వగలదూడ
గెజ్జలున్నా తిరపతమ్మకు
గల్లుమనే మువ్వలదూడ
గాజుకన్నులా గంగారమ్మకు
నాజూకైనా నిగలదూడ.
ఓ కోల మొగమూ
పిట్టనడుమూ
పైడి బిగువూ
మట్టె మీటలా
నాత్తె మాడే
వుబు కుబుకుల పిల్లా!
సెయిగలిపి సిందులేసుత
దూడలెంటా దూకి పోదామా.
"యాడ నేర్చావయ్యా యీపదాలూ?"

ఓసి దీనికడు పుడకా రానే వచ్చింది, ఒ. పచ్చిమామిడికాయకొరుకుతా ఒయ్యారంగా.

"పదాలు మాజోరుగా యిసురుతున్నావే ?"

"నీకేం యిసురుకుంటే ? ఫో"

"పోటానికి నూ సంపాయించావా యీ సోటూ ?"

"నూ సంపాయించావా ?"

"నూ సంపాయించావా ?"

"తగు వాడాల నుందా ?"

"నువ్వే తగు వాడ్నుండావు"

"మొదులు నా వూసెందుకు నీకూ ?"

"పదాలు బాగుంటే యింటాని కొచ్చా, తప్పా ?"

"వూc. తప్పులా, తోటకాడుండి కొక్కిరిత్తా, కోతల్లే?"

"నువ్వేకోతివి. నువ్వేకొండముచ్చువు కావcలు"

"ఆc, రోజూ అంటల్లా, యియ్యాల కొత్తేముందీ ? మా లచ్చిని సావ నూకీ !— ఆడగూతురికి అంతపొగురుం డక్కుర్లా"

"ఓమ్మొ, ఓమ్మొ ! మా లచ్చిని సావ నూకానూ? ఎం తన్యాయం? అందుగ్గాదూ కోతినంటా ? లేకుంటే పతిరోజూ ఆవజాన ఎగబడి సిన్న సిన్న మొక్కునంతా యిరగ దొక్కుతుంటే, తోటోళ్ల గతేంగానూ ? కాత్త బెదురుపెడ్తే సావకొట్టి నట్టేనా లెక్కా ?"

"ఏమో ఎవుడునూకాడూ మాలచ్చి ఆవజాన ఎగరొప్పుతా వత్తే యీ మను కోవాలా ?"

"ఏం అనుకోకుంటానికి తోట మట్టిన కొట్టుక పోవాలంటావు ?"

"తోటసంగతి ఓడికి కావాలా, నన్ను మటు కంటల్లా మాటలూ ?"

"ఏమన్నారయ్యా, సిన్నపిల్లాడల్లే ముత్తులు కుడుతుంటావూ ?"

"నూ పెద్దదానివి కాబట్టేగా ఆమాట యీమాట అంటం ?"

"నూ మటుకు పొద్దాగు తుండావా ? అన్నీ తెలుసు నీకూ"

ఆడనే కూకుంది సెట్టుసాటుగా మాయిడికాయ కొరుకుతా. ఏందో

తియగుముగా వుందిగాని, అదేందో అంతు పట్టటంలా. తనికీ సేసి సూత్తే తన్ను తిట్టుద్దనే యవ్వారంగా ఆపట్లా. అసలు కతేందీ ?

“మాయిడి కాయ తింటా, యిత్తానూ ?”

“నువ్వే తిను, నాకేం అక్కర్లా.”

“ఎందుకయ్యా అంత కోపం ? ఎవురేమన్నారూ ?”

“ఆఁ, ఏమన్నా, రోజు అవజాన ఏడిపిత్తూ ?

“నీకు కోపంరాకుంటే, ఎందుకొత్తాను యీడకూ ? నువ్వేందో, నీగోలేందో, పక్కమడసుల సంగతేంగో కనుక్కొక్కర్లా ? ఎన్నాళ్లయ్యా ఈ గారాబం ?”

“వుప్పుడు, నూ, నన్ను గారాబం సేత్తుండా వెట్టా ?”

“పోరా నీకసలు తెలువదు ! ఓపాట పాడు. బాగా పాడ్తావే ! ఇందాకేంది మంచిపాట పాడ్తుండావూ ?”

“ఎందుకమ్మా కొక్కిరియ్యానా ? నే పాడను ఫో”

“నేనేం అననుగా. కాత్తె పాడ్తే, ఇంతలో ఏం తిటారయ్యా నీదీ ?”

“నిన్ను నమ్మిందెవ్వడూ ! అవజాన తిట్టీ ? నే గొడ్డకు నీలు బెట్టి యింటికి పోవాలి, ఫో”

“ఆఁ, కూకోన్నెట్టీ జడేసి పూలుదోపుతా రా !” మూతిముడుసుకు లెగిసి ×ాగబపోయింది. మందను నీలుతాపి, ఆడీడ మేపుకుంటా, కొంపకు సేరుకుని ఆ రేతిరి కలత నిదర పొయ్యాడు గోపాయి.

* * *

మఁగనాడు............

మామిడిపిందెలు పండవొచ్చె
మామిడికొమ్మలు నేలకొరిగే
మామిడోళ్ల పిల్లా పళ్లు ఏసుక పగలబడే
ఓ మామిడోళ్ల సిన్నికూతుర
మామిడిపళ్లకు మనసు తెలసెనే.

తోటకాడికి వచ్చేతలికి, టఫీమని ఓ మాయిడికా యొచ్చి ఈపున

గుద్దుద్ది. కంచెపక్క సెట్టుమీనగా కూకుని సుబ్బి పచ్చిలా కిలకిల నవ్వుతుంటది.

"ఏందా ఒల్లుపొగరూ, మళ్ళీ నిన్ను కొడ్తే?"

"ఆఁ కొట్టావులే సప్పట్లు. మరా పాటేందీ ని?"

"నీకేం పాడుకుంటే, నువు యింటావని కల గన్నానా?"

"(కిలకిలమంటా) ఎందుకయ్యా అట్టబయపడిసత్తావూ నేనంటే? తమాశకంటాగాని, నువంటే పానంగాదూ! సెట్టుమీన కొత్తే ఓదోరపండు మంచిదిత్తా, వత్తావా?

"నే రానమ్మా"

"ఏం చెయ్యన్నే, రా రా, మంచి పండుంది కోద్దాం?"

"ఏమో నిన్ను నమ్మం దోడూ!"

"పానీలే యింతేకదూ!"

"మరి, యాడుందీ పండూ?"

"ఈడ ఈకొమ్మ నుందిరా, కోసుకుని ఈడనే తిందాం సప్పున రా రా!"

గబగబ గొడ్డను ఆకుప్పలెంటా ఈకుప్పలెంటా తోలేసి కంచెదాటి సెట్టుమీనకెక్కి—

"యాడమ్మా పండూ?"

"ఏపండూ?"

"మాయిడిపండు కొమ్మనుందంటివే! ఎందుకమ్మా యిట్టేడిపిత్తావూ?"

"యాడవుకురా, పసిపిల్లోడల్లే! ఎన్నాలురా నీ కింకా ఈగారాబం, పెద్దాడివి కావట్లా?"

"అబద్దాలాడి, నాకు తెలవదూ నమ్మకూడదనీ"

"వుండరా. అబద్దం కాదురా. అదుగో ఆకొమ్మ సివర్నా; నువ్వీ దోటీ పట్టుకలాగూ, నే అందుకుని కోసిత్తానూ, అంత ఒకు దుడుకవుతే ఎట్టా?"

దోటీ తీసుక కొమ్మకేసి లాగి పట్టుకుంటే, జాగర్తగా పాకి పడకుండా కోసుక తెచ్చింది.

"సూశావా ఎంతమంచి పండో! ఈకొమ్మ మీన కూకుని తిందాం"

"ఇటు దే, నే కోసిపెడ్తా, నా కాడ ముల్లు కత్తి వుంది"

"నీ ఒల్లు యింత కాల్తున్నదేరా?"

"ఏమో నా కేం తెల్వా, అదం తేలే"

"సరేగానీ, ఓపదం పాడవూ?"

"నూ పాడరాదూ?"

"యిద్దరం పాడ్దాం, ఏం?"

"ముందు నూ పాడ్తావా?"

"ఆ, యిక్కడ కాదు, కిందికిదిగీ ఆదుబ్బలా గుండేనా, పోదా? అందులో ఎంత సల్లగావుంట దనుకుండా? దిగు నూపిత్తా ఎంత బాగుంటదో." మంద మందంతా గోపాయిని ఎదుకుతా తోటలో జొరబడ్డయి. యాడనుంచి సూశాడో ఎంకడు, పెద్ద కర్రొటి తీసుక, ఒక్కోదాన్ని బాత్తుంటే, ఓదారంటూ తెలవక మంద మందంతా ఆపొదమీన సజ్జుసజ్జుగా లాత్తిసె...

ఒక రేత్తిరేల పక్కమీన కూకుని పెద్దపెట్టున ఏడుత్తుంటే, అల్లమ్మ యీపు సరిచి బెదురుపోగొట్టినా, దడుపుజరాన, ఓ నెలరోజులుపడుకున్న మంచంలోంచి లెగవలా గోపాయి.

# సీ క [illegible] త్రం

అమ్మకానికి నేతిడబ్బాలు తెచ్చిన బుచ్చియ్య, సందులూరు సావుకార్లు కల్తీ సెయ్యని దగాబేరాలాడ్తంటే, ఒల్లుపాట్టు కాకమీన సావుకార్లను సెడదగిలి, కేత్రవు తుండదని జీతగాడు ఆచ్చేసు సెబుతుంతా, తూత్తెరి ఈ సోంబేరి పెదేశంలో ఓ ఛణం వుండనంటూ, మల్లీ డబ్బాలు దున్న కుర్రల బండికెత్తి, పయానం లెగవదీశాడు సీకట్లో కస్సు బుస్సు మంటూ.

బుచ్చియ్య అయ్య శంకరయ్య, నేతి యాపారంలో వోదారికొచ్చి, తను పెద్దోడైపోటాన, కొడుకును మరో రాత్తానబడనీక, తను పైపైన తనికీకుంటూ, నే తేపారంలోనే పెవేశబెట్టాడు, నాలుగుడబ్బులు సూట్టం అనుబవంలో వుంటాన.

తనకు రెటుమతంగా అయ్య పెల్లిజేసినా నోరు మొదపలేదు గాని, కాపరం ఆరంబంలోవుండి, యింటిమోజు వొదలకతలికే, ఈపన్న దున్న కుర్రలబండి మీన డబ్బా లెత్తిచ్చి, పరిసెయంలేని బయిటుపెదేశాలకు ముసలాడు పంపియటం, బుచ్చియ్యకు గంగా యిట్టంలా.

ఆచ్చేసుకు పది పన్నెండేళ్లొచ్చేమయాన, అమ్మ రోసెమ్మ, కొడుకును ఏదన్నా పనికిపో యొత్తుండమని సెప్పినా, నిన్నిడిసి యాడకో ఎల్లటం ఏందో గానో వుంటదని కొడుకు ముద్దులుకుడపటాన, యింకో మూడేళ్లపాటు ఈ యిశారం తోసుకుబోయినా, పక్క శంకరయ్య కొడుకును మరికాత్తె పునాది గట్టి సేసుకోను, నే తేపారానికి తోలటంసూసి, యవారాలు ఆరంబం కాడ యిట్టుం టయ్యని సప్పున గెహించి, కొడుకుమీన బెమేసుకుని, బుచ్చియ్య కాడ జీతాని కంపింది ఆచ్చేసును రోసెమ్మ.

“ఈ ముసల్ది పానం తియ్యంది ఒదులుద్దీ! ఎటూకాని యాల దున్నకుర్రల్తో యీపయానవేందీ? యియ్యాల అమా సేవోఁ సావు! కాత్తె నచ్చత్రాలన్నా ఆపశవేం సందడిగా!” అనుకుంటున్నాడు ఆచ్చేసు, తొట్టోకూకుని దున్నల్నదిలిత్తా.

“ఈముసనాడు కంగ్ కంగ్ మని దగ్గుకుంటా కొంపలో ఒకటే సనుగుడైతే,

ఓ పెళ్లాం, ఓ మోజు, ఓ కాపరం, ఏవఁన్నా అనుకోను యీలవుద్దా? జిడ్డు జిడ్డుగా సవుఁరు బూఁస్తుకు తిరగమంటాడుగాని, పోటుఁపాడిసినట్టు ఈ లింగపాడు యాడుందో!" అని యిశార బడ్తుండాడు బుచ్చియ్య, బండిమీఁన ముసుగేసుకుని, డబ్బాల్తోబాటు వూగుతా.

"ఈ సీకట్లో లింగపాడు యాడ తగులుద్దండీ?" అని ఆచ్చే సడిగాడు బుచ్చియ్యను.

"నూ బండిని కదలపరా? ఏకాడికి జిగటలు కారుత్తా జతపడ్డావుగాని!"

"యాడేం వుందీ తెలవక, ఇది యాడుందం•నడిగానండి! యాడేం వుందో!"

"ఈ డేడ్లో తగులుద్దంటనే లింగపాడు?"

"బాగుంది! యిగ నన్నంటండీ అడగటం? పయానం లెగవదీ తిరీ! ఎల్తుంటిపిఁ! అమాళ సీకట్లో రాత్తా మద్దెనంటండీ యాడేం వుందీ తెలవందీ? ముసల్ది ఓటి సేసుద్దీ!"

"నూ మెల్లో ఎండికం టెతో యావఁని ఒచ్చినట్టురా? పంబవాయిత్తా సవుఁరు కార్చావంటే! పానీ బండిని! ఎవురన్నా అగుపిత్తారే! ఈ ముసలాడు మమ్మల్ని ఏ నక్కలకు బెట్టిందీ వూరక పానిత్తాడూ!"

"యదవ పని! కుదిర్నందు కనాలి యీయదవను! యింటికి పానీ, ముసల్దాన్ని దుస్న కుర్రల బండి నెక్కియకపోతే!"

"ఎవురూ ఆగుపియ్యారేం! పానీరా దబ్బునా! ఈదున్న కుర్రలు పుట్టినందు కనాలి పాట్లేళ్లకు మళ్లే నిగడదీత్తా!"

"ఆటికి మట్టుకు నిదరేల కాలేదంటండీ? ఓసిపదండే, మిము సిరతగందు ఈడవా! ఈడ సిరతగల్లుమట్టుకు వుండవనేందీ? సల్లగా ఈ పీకి కాత్తా కోరికేత్తే, ఆడకీ డబ్బా లెవారవేందో తేలుద్ది! పదండే, యాడో, నిదర మొగంనాయాళ్ళు దొరికారుగాని!"

గల్లు గల్లుమని డబ్బాల సొరాలు యినిపిత్తుంటే, సందడికి కల్లుమూసుకుని సంతోసంగా దున్న కుర్రలు పాకిపోతుండై, లింగపాడు బలానోచ్చట తగులుద్దనేం లెక్కలేకండా.

* * *

“ఏవిఁడోవ్! మనం ఏకాడి కొచ్చినట్టూ? కాత్తె పలకవయ్యా నీయిల్లు బంగారంగానూ! ఈసీకట్లో డబ్బాలమీన యెట్ట నిదురొచ్చుద్దో మడుసులికి! మొదులీ సీకటి పయానాలంటేనే నాకు వాత్తీలేకపాయె! కాత్తె లెగవయ్యా, కరుత్తాడేవోఁ నిదరకత్తున! అసలట్టాటి మడిసేలే! పేసీగా వుందే! ఆ కాడి కాకాడికి ఈ సెల్లేం సచ్చిత్రాలకు లెగుత్తుండై! పానఁదీసి అడివికాదుగదా? ఏం వుండయ్యో ఈడ! కాత్తె నిదరన్నా రాదేం ఈయదవకు? బలేవోణ్ణి పుట్టాలే! ఓసిపదండే సడ్డి యిరగదన్నే వోళ్లు లేక! ఆవులిత్తండాడుగాని!”

“పాడవండి, నరకండి, సంపండి”—దనాదనా సెట్లల్లోంచి బూఁవి యిగగ దొక్కుకుంటా, ఓదానెం టోటి, రోడ్డుమీన బండిని రాసుకుంటా, ఆతల పొదల్లోకి గంతేసి, తబతబా లగెత్తినై—“సంపు—పోడు”—అనరుసుకుంటా కఱ్ఱసాము సేత్తా రోడ్డుమీన కొచ్చి వాలాడో మడిసి.

“దెయ్యం! బూతం! రాచ్చేసి! సంపినై—ఓబుచ్చియగారో!” అని ఆచ్చేసు పాఁవాణ్ణట్టాడి, తొట్టోమడి సావజానే నీలుక్కుపొయ్యాడు, బుచ్చియ్య డబ్బాల మీనుండి రాకతలికే.

“ఎవు రాడ?” అనడిగాడు రోడ్డుమీన కొచ్చిన మడిసి.

“మేం బాటసార్లంగాని, యేందయ్యా ఆలగెత్తుతుండదీ?” అనడిగాడు బుచ్చియ్య పైకం వొదిలి.

“మావూరి రంగమ్మ పడ్డండీ! ఎదైనా గొడ్డును కాత్తె యిసారింపక్కర్లా? నిసిరేత్రంటుండీ తాడుదెంచుక, కనపడ్డ దున్నకుఱ్ఱను లెగవదీసి, పంటసేలకు సికారొచ్చేదీ? నిన్నా అంతే! సెప్పినానన్నా ఆమడిసికి కాత్తెగ్నం వుండక్కర్లా?”

“పానీలే! యిదేవూరు?”

“తపనపల్లి కాదంటయ్యా! ఏవూ రెల్తుండారేం?”

“తాటికొండకాడ తపనపల్లా?”

“మరే”

“రంగమ్మెవరు?”

“అఁ, పోయినకాపయ్య సెల్లాఁ వుండిలే!”

"కావయ్య సచ్చాడా ?"

"అరుమాసాల పైసిలు కవుతే !"

"అరెరెరె ! యిప్పుడు తపనపల్లిలో వుంటుండదా రంగమ్మ ?"

"యిద్దరూ వొచ్చి వుంటుంటే, మొగుడు పోయే! సక్కనిపిల్ల! వొంటరి దై పోయింది."

"యింకా తాటికొండలో వుంటుందా రనుకుండా!"

"మీ రేడకి పోతుండారు?"

"లింగపాడు కెల్దా వనో త్తుంటే, దారితప్పి పొయ్యాం."

"పొత్తరోడ్డుకాడ రాత్తాసీలారు కావయ్ను! అబ్బో సానా లెక్కొచ్చారే! రంగమ్మ తెల్సివ మడిచా?"

"తెలుసురే! కాత్తె అల్లింటికి దారి నూపిత్తాయ్యా కట్టం అనుకోక?"

"అఁ, కట్టం యాడికిరే! దారి కాత్తె లెక్కనూపిత్తాగాని, రంగమ్మతో సెప్పయ్యా పడ్డ మల్లీ కందిసేను పాడు సేత్తుండ దని."

"ఒరే, ఆచ్చేనూ ?"

"నే రానండి ! ఈ తపనపల్లిలో పిచ్చికుక్క లుంటయ్యంట!" అన్నాడు, కాత్తె తెప్పరిల్లుకుని, మడుసులని తెల్సి,యవారాలన్నీ యింటుండ అచ్చేసు.

"ఎండి కంటె ఎగురుద్ది యదవా ! బండిని మలుపు !"

"యిదిగో, ఈదార్న కాత్తెలెక్కపోయినాక వూరొచ్చుద్ది. మొదట్లోనే యిష్టగుడి వుంటదీ ! దాని కెదురుగానే కొబ్బిసె ట్లున్నయి. ఆడే వుం దాల్లిలు. గుడికాడే బండి యిడుసుకో వచ్చు."

* * *

"సొన్నాలయింది నిన్ను నూసి!" అన్నాడు బుచ్చియ్య, రంగమ్మను నూసి దిమ్మరపోయి.

"నూసో !" అంది రంగమ్మ మెల్లిగా, యింకో ఏపు నూత్తూ.

"అనుకోని యిదంగా నూశా నిన్ను !"

"వుఁ."

"బాగుండావా ?"

"ఆఁ !"

"కావఁయ్యన్న పోయినా డంటుగా ?"

"పోయి సానా కాలవఁయింది!"

"నాకు తెలవదు, రంగీ—రంగమ్మా !"

"వుఁ."

"అసలు మీ రీడ వుంటం నాకు తెలవదు. లింగపాడు రొమ్లా [illegible] దాటి దప్పి యి టొత్తే తెలిసింది."

"లేకుంటే ఈలర్యేదా ?"

"ఎందుకు రం-గమ్మా నేనంటే [illegible] తగా మాట్టాడ్తుండావు ? [illegible] బావను మరిసిపొయ్యావా ?"

"ఆళ్ళె యాడదీ ?"

"రంగీ ?"

"నా పేరు రంగమ్మ! కావఁయ్య పెళ్లాన్ని !"

'... ... ...'

"... ... ..."

"ఎట్టా మరిసి పోతా, రఁగీ !"

"ఆయి నుంటే, నూ అట్టా మాట్టాడ్దా ?"

"లేదు, లేదు—ఏడుత్తుండా—రంగమ్మా ? పానీ నేనే ఎదవను!"

"..............."

"ఎన్నా ళ్ళయిఁది నిన్ను సూసి ! ఎంత మారిపొయ్యావు!"

"నే నెట్టబోతే ఎవురికేం !"

"అంతేనా ! నిన్ను సూత్తుంటే ఎంత సంతోసంగుందీ, నీ కెట్ట తెలుసుద్దీ ? సిన్నప్పుడు మనం ఎట్టా వుండేవోల్లం !"

"నో రెట్టొచ్చుద్దీ ఆ మాటలకూ ? అయిదు సమచ్చరాలయింది నా పెల్లయి! యఁదవ సచ్చిఁదాన్ని కాబట్టి, నే తలుఁసుకు సచ్చాఁగాని, బతికున్నా డయితే రాక పొయ్యేవోఁడా ! "

"నూ పెల్లి సేసుకున్నాక నేనేడ గాపకం వుంటాను ?"

"ఛీ నోళ్లకేం అద్దాలుంటేగా! మీ [illegible] ఈ గ్రామంలోతా ఏ [illegible] గా నుంచే, ఆ పిచ్చానన్నైనాక ఆప నీళ్లు నద్దా? నిప్పుదీయా పడేదో నూ [illegible] నన్ను! అన్నా అన్నా అని ఎంత బతిమిలాడినా ఒళ్లుగుల్ల కూతలు కిమ్ము కుంటూనా! ఆ వుండ బూమిని రాసిత్తే, పెళ్లి సేత్తాపంట! ఈమా మేనమామా [illegible] గాని! యిన్నెవారాలు నడుత్తుంటే నీకిల్లేదకి బోయినై? 'రంగీ! నిన్ను దప్పచేసుకోనే!' అని నోరు బార జాత్తివే? అప్పుడేదకు బోయిందీ యీ బుద్ది? యింక 'నేగాపకం వుంటానూ' అనడుగుతా? ఏమంటి తెలుసుంటా మాటున్నా? నిన్ను నూత్తుంటె ఎంతమండు తుండది లోన!"

"రంగీ?"

"ఛీ! నా కాడ మాట్లాడమాకు!"

"ఎందుకంతకోపం, రంగీ, నన్ను నూత్తె? సిన్నప్పుడు నన్ను నూత్తే ఎంత యిట్టంగుండే దానివి! ఓ రోజున నీకు సెప్పకుండా, గారడీ నూడను నేనెల్తే, బూదినక, ఏడిత్తివే బావ బావంటూ? అయ్యన్నీ మరిసిబోయినా? నూ అయ్య ఎటువోంటివో డయిందీ నీకు తెలవదూ? నిన్ను దప్ప నే నింకోర్ని పెల్లాడని మోరాయిత్తే, నూ కొడుకువుగాదని, నన్నింటోంచి లెగిసిపొమ్మన్లా? సీల్చేత్తానన్లా నన్ను? అనక నూ పెళ్లి సేసుకుంటిని! యియ్యన్నీ నీకు తెలవదా, రంగీ?"

"ఎందుకు తెలవదూ? యిప్పుడు మీఅయ్య నన్ను నూడ బంపాడనీ తెలుసు!"

"ఎవురిపాపాన వారు పోతారు! నిన్ను నూశా ఎట్టనవుతె!"

"ఏం లాబం?"

"నూ యింత అందం గవుతానని నే నెప్పుడనుకోలా, రంగీ!"

"వూఁ!"

"సిన్నప్పుడు ఓ రోజున, నండేల, మీ పెట్టెసేలో జొన్నకంకులు - లుసుకు తిన్నాక—గాపకం వుందా?"

"..........."

"ఆనాడు రేత్రి మంచం కాడి కొచ్చి కాలుగిల్లిరివే?"

"అయ్యానీకి తెలుసుకునేదాన్ని! ఎం తేసుత్తే మటుకు కేంలాబం! యిప్పటి కొత్తిని!"

"ఎంత దయపెట్టావు, రంగీ? నే ఎన్ని సాల్లు తెలుసుకుండా సిన్న!"

"ఎంత బారీగా అయ్యావురా! యింకా సొట్టలు పడ్తుండయ్యే నీ బుగ్గలు!"

"యిప్పటికీ సిన్నరంగి మాటలే నీయి!"

"నీయి మటుకు? యిన్ని గిరజా లెప్పుడు పెంచావురా!"

"నీ మొగం మెరుత్తుండదే!"

*　　　*　　　*

తెల్లారేయాలకు ఆచ్చే సొచ్చి దబదబ తలుపు దట్టాడు.

"ఓ బుచ్చియ్యగోరు, బుచ్చియ్యగోరూ? లెగవండయ్యా, లెగవండయ్యా? ఆ పేడరాసిన నేతిడబ్బా లావజాన కాలీ అయిపొతంటే! పొద్దుకుండ గోతాం వంతా మునిగిపొయే! వీ అయ్యా సావదన్నాక దొబ్బున రావయ్యా? తెల్లగ తెల్లారింది లెగవ్వయ్యా, నీయిల్లు బంగారంగాను!" తత్తరబెట్టి లెగిశాడు బుచ్చియ్య.

"రంగీ, ఎల్లొత్తా! ఆటి సంగతేందో సూసి, దబ్బున లింగపా డెల్లిపోవాలి! ఎటూ అయ్యా సేతిలో తప్పవు!"

"అట్ట వొనికిపోతా వెందుకూ? యెల్దువులే!"

"ఆం నీ కేం తెలుసుద్ది! సంపడూ! మల్లీ వొత్తాగా?"

"?"

"యెల్తుండా!"

"—బతికుండి మల్లీ రావాకు!"

# శివరేత్రి సంబరం

"అయితే అన్నకు బువ్వెత్త కెల్లవేందిరా కొండయ్యా?" అని యిను గుల్తో అరిసిందె కొండయ్య అమ్మ యీస్పరమ్మ.

"............"

"నూ పలకవేందిరా గానిగద్దుకుమల్లే? గొంతు గుంజకబోతుందది కాత్తె మాట్రెనా కొండయసచ్చినోడా?"

"నన్ను కొండకు పంపిత్తానంటే?" మాట సల్లగా రానిచ్చాడు కొండయ్య, శివరేత్రి దగ్గిర కొచ్చుంటాన.

"ఆడే పడి సావు—కొండేందీ! కొం డేందిరా మాయిదారి పచ్చి?"

"నే పొను!

"యాడికిరా నూ పొండీ?"

"నే బువ్వెత్తికెల్లనే!"

"పాల్లు రాలన్నా, ఎదవసచ్చినోడా! ఎత్తికెల్లకుంటే యియ్యాల్టి కేవుండా వుండయి!"

"నన్ను కొండకు పంపిత్తానంటే!"

"కొండేందిరా నీ మొదులారా?"

"కోటయకొండకే!"

"కోటయకొండకూ! ఈడి కేం బుట్టిందమ్మా!"

"నే పొవల్సిందే! సూరాయాల్లంతా ఎల్దం లేదమ్మా?"

"ఆ సూరాయిగాడంట్రా — ఆ కబోది పచ్చంట్రా నీకెటు సేరీ — అటునే ఎల్దువులేగానీ, ముంగల బువ్వెత్తుకెల్లూ, అయ్య కేకలేత్తాడూ!"

"అయితే పంపిత్తానంటావా?"

"ఈ ముద్దేందమ్మా నాకూ ఓసెంప కూడెత్తి కెల్లాల్సిన పనుంటేనూ— మొదులు నూ లోనికి పొ, నీ కతేందో అయి సెలుత్తాడూ—"

"ఓ అయ్యో్యావ్, నూడే పడ్తోతుండదీ—"అంటూ యిదిలిచ్చుక, లోన ఒల్లు చరిలేక పొండుకు నుండ కోటయ్యకాడికి లగెత్తు కెల్లాడు కొండయ్య.

కోటయ్యా కిట్టకాలవలో బల్లకట్టు నడుపుతాడు. పెల్లాం, యిద్దరు సెరిగొత్తుండ పిల్లకాయలతో కాపరం కాత్తె సుమారుగా చరిసూసుకుంటా పోతావుంటాడు కోటయ్యా. మడిసి గొడ్డపారకుమల్లే సిసలయిన గెట్టివాన బోతావుండా, కాల్దోసం సెట్టంలో రెన్నాల్ల్నించీ కాయలాన బడ్డాడు రతంలాంటి కోటయ్య కాత్తా.

"అబ్బ, ఏందిరా జాతర సేత్తుండావు కొండయ్యా? దా, యిటొచ్చి కూకో." అంటా కొండయ్యాను దెగ్గిరికి లాక్కుండాడు, మంచంలో ఒనుకుతా పడుండ కోటయ్యా.

"ఏందయ్యా యీడ్తో పెలయంగా వుంది దినవూ! ఆడకూకో ఎట్టుకుంటే ఎట్ట గుదురుద్దీ? న్యూ లేసిరావేందిరా, అన్నకు బువ్వెత్తుకెల్దువూ?" అంటా తనూ లోనకొచ్చి సేతు లాడిచ్చింది ఈస్పరమ్మ.

"ఏందే అణ్ణి గాబరాబెడ్తావూ? కాత్తె అన్నకు బువ్వెత్తికెల్లగా అంటే ఎత్తికెల్లడంటే?"

"ముంగల యీణ్ణి కోటయకొండకు సంపియిట వేందో యిశారియ వేందీ? ఏందోనయ్యా పానాలు శాదేసి తోడ్తుండాడూ!"

"సూడయ్యా ఎట్ట సెప్పద్దో! పంపియ్యాలంటే మాయ్య పంపీ డను కుండావా? ఏంయ్యా?"

"వూఁ, పొయ్యావులే పొలుపు దీసుక బాదే ఓళ్లు—"

"సూడయ్యా!"

"నువ్వుండే మొదులూ—యిప్పటున్నించీ కొండలేందిరా కొండయ్యా?"

"ఏంయ్యా, ఆల్లంతా పోతం లేదయ్యా కోటయకొండకూ—సూరాయ్, బూసాయ్, ఈగాయ్-మరి-మరామైన-కోడూరిపెబ ఎల్తావుంటే—"

"ఆఁ ఈపిస్సె పిట్ట ఎంటుండాలె గావల్ను మొల్లో గెజ్జలాడిచ్చుకుంటా"

"సూడయ్యా!"

"నువ్వేందే మద్దెనా—వూఁ—నే దేలుత్తాగా."

"నాకేవిటికిలే!" అనింది ఈస్పరమ్మ యవారం సప్పున గెహిత్తా.

"పో వద్దంటే అయ్యా?"

"అట్నే పోదువులే. యిప్పుడాల్నుంచి గడబిడ ఏవిటిగానీ—"

"కాదయ్యా, ఎల్లుండి మద్దాన్నంకాణ్ణుంచి కోడూరి సెబ ఒచ్చుందంటా—"

"అట్నే పంపిత్తే సరిగా! అడికి బూకట్టిచ్చి పంపీక అట్ట నిలబడి సూత్తా వేంటే? నా అణ్ణం అనమాకూ, ఆడసలు మంచోడుగాదూ! కాత్తె దబ్బున బొయిరాయ్యా పొద్దుబోతుండదీ!"

"యీవజాన దొడుమీ నె తీకెల్లనూ—అయ్యా! యియ్యాల అన్నతో ఆడే పొండకోసంటే? అన్నా రా మన్నాడే అయ్యా."

"ఆడ నూ దేనికిరా తగలాటానిగ్గాకుంటే? ఒద్దులేయ్యా, యింకోపా ఎల్దువుగానీ!"

"బలమాశగుంటదే ఆడ, అయ్యియ్యా మాట్టాడుకుంటా పొండుకుంటే!"

"దబ్బున పోరా ఎట్టవోగట్టా! సిరిపేసాలు వొయిక కాత్తాడ బద్రం! అన్నను కనిబెట్టి సూడమన్నోయ్"

"ఎల్లుండి మద్దాన్నం పంపియ్యాలయ్యోవ్-"

* * *

నెత్తిన బువమూటా, సేతిలో ఎదుకర్రా, మొల్లో గజ్జలాడించుకుంటా, కాలవగట్టు మెలుపె సిల్కుపయానానికి వుసారుగా పదా లాడులుకుంటా, నూత్తె లెక్క కొండయ్యొచ్చేతలికి, పొరిగింటి ఆదిలచ్చి బుంగ సంకసెట్టుక వూ రెలపల బాయికాడికి నీల కొత్తా కొండయ్యను జతబడ్డది, కొప్పు నిగి డిచ్చుకుంటా.

"హు! యీడికి ఒయిల్లెల్లినా పొద్దెరుకేం దంటా!" అని కాత్తె గట్టిగా అనుకుండాడు కొండయ్య, కాలుసాగిత్తా.

"మసగనూపులోళ్ళకు మరింకెట్టుంటదీ!" మరి కాత్తె యిసురుగా అనుకుండది ఆదిలచ్చి, కొండయ్యొంటనే నీలకుబోతా.

"పిక్కెపిట్ట ఫుయ్ ఫుయ్!"

"సాల్లే సంబడం! ఎందుకయ్యా అట నోరు జారుద్దీ?"

"పొద్దుటాల నక్కెక్కరి త్తివే?"

"ఎప్పుడయ్యా?"

"ఎప్పుడా! బజస్సెక్కల్లో మా దూణ్ణాడిత్తుంటే, దడికాణ్ణుంచి ఎక్కిరీలా?"

"ఆట్నికూడా ఎంట—తెచ్చుకోబొయ్యా?"

"ఆఁ, నీకు పెల్లి సెయ్యాలనీ!"

"ఆడే వొచ్చుద్ది—పెల్లిమా ఎత్తావంటే!"

"నే కోటయకొండ కెల్తున్నాగా!"

"............"

"మాయ్య నన్ను నూరా యాళ్లతో కొండకు పంపిత్తాన్నాడుగా!"

"ఒట్టిదేలే!"

"వృప్పుడే గదమ్మా నే అడిగొత్తుండది"

"నిజవఁట్రా?"

"ఎల్లి మాయ్య సడుగూ! కాదంటే అప్పుడనాల్చిందే!"

"ఎందుకయ్యా కొండకూ?"

"నే బోతాగా!"

"కూడ బాగుండకయ్యా ఆడసుబొయ్యేది? మనూళ్లో రతం కడ్తారంటా, బాం డాత్తాయిరంట్రా, రంకుల్రాటాం ఒచ్చుద్దంటా, చుబ్బయ్య అవ్వాయి సువ్వాయి ద్దెచ్చాడంట్రా—"

"యిట్టాటివి కొండకాడ లచ్చ లుంటయి లేయే! గెనగెన గెంటలాడ్తా రంగురంగు సెబలూ, గులాందుమ్ము ల్లెగుపుతా ఎట్టాటి మనగా డెద్దు లొత్తయ్యనుకుంట్రా—"

"ఆడజనం తొక్కిళ్లుబడ్తా ఓరి మీనోరు పడ్తావుంటే పిల్లోళ్లు సత్తారంట్రా, మా పిన్నావఁ సెప్పింది!"

"యియ్యన్నీ నాకు తెల్చులేయే! ఈకొండయముటా ఎల్లిదంటే ఆ డోజనఁ వాగుతారంటే?"

"ఒద్దులేరా యీడ మాబాగుంటదీ! మరే, నా కొత్తరెయికా, కొత్త కోక మామ్మ ఏసుకోమందిగా."

"అరఅరా అంటంటే కోటయసావిఁ దిగిరాల్చిందే!"

"యిగమీన ఎక్కిరియనుగా"

"అరఅరా, లెగిసిపోతావుంటే—"

"పానీలేరా— నే ఎల్తుండా—"

"ఎల్లాల్సిందే, అరఅరా—"

*　　　*　　　*

పద మీ్మన పదం దులుపుతా, ఆడుగడక్తూ ఎగిరెగుర్తా, మెల్లో గజ్జలు జిగ్ జిగ్ మంటూ, నిమట్లమీన మెల్లెక్కా పయానం జేసి, వుసారుగా కాలవ గాట్టెకాడు కొండయ్య. సీకటి కమ్ముకుండది. తలతల నచ్చిత్రా ల్నాడిచ్చు కుంటూ రయింరయింన లగుదోల్తుండది కిట్టకాలవ, కెరటాల్ని యెడాపెడా యిసుర్తా.

"ఓ అన్నోవ్ ?" అని కేకేశాడు కొండయ్య.

"ఓ అన్నోవ్ ?" అనరిశాడు కొండయ్య, బల్లకట్టు మీనోరూ లేకుంటే.

"ఓరి రారా కొండయ్యోవ్ !"

"చివయ్యన్నా ? యాడ్రా నువ్వూ ?"

"ఈమర్రి సెట్టూడల మీన్రోవ్."

"అం ఏందిరా ? ఆ డేం జేత్తుండావురా-వూగుతుండావంట్రా ? ఆ మబ్బుల్లో !" అంటూ సెట్టు కాతైడంగొచ్చి నిలబడ్డాడు కొండయ్య, మూటు దింపుక యింతగా నూత్తా.

"ఓ ఏండ్ర కొండలా ఎంకట సావాం
నీకు నాకూ జోడు అయితే
వల్లగొండా లడ్డవయితే
నీలి మేకము నీలంగార్చెరా.
ఓ ఎత్తుకొండలా చుందరనాసావాం
నీలిమేకము నీలుగార్చెరా.
—హాయ్, హాయ్, దూకుతుండా నూస్కో, నూస్కో—"

"చివయ్యన్నోవ్—దడిపిమాకరా సత్తుండానూ ! అమ్మబాబో ! ఆ డిప్పు దంట్రా వూగేదీ ? ఆ డేం వుంటయ్యో తెల్చా—"

"ఎహేహేహేహేహే—"

"అటు నవ్వమాకరా పీసు పీసు మం టుండదీ—"

"కోటయ్యన్నోవ్—ఓ బల్లకట్టుకోటయ్యన్నోవ్? బల్లనిట్రానియ్యయ్యా, దబ్బున దాటాల, పొద్దుబోయిందీ!" అ నోమడిసికంటం, అవకాడ గట్టు మీన్నుంచి కేకేసిఁది, సెట్టుమబ్బుల్లో ఆస విగ్రహం అగుపీకుండా.

"ఓ రానుడ్చీ? ఒత్తుండా ఒత్తుండా నిఁఖసూ—దార కొండియ్యోఁవ్." అంటా బల్లకట్టుగొలు సిప్పి తణామంటా బల్లమీ నేసి, ఆతలేపుకు బల్లకట్టు నొదిలాడు శివయ్య, గెడ అనుబవంగా ఏత్తా.

"ఆ కేకేసిం దెవురో!" అనుకుండాడు కొండయ్య, ఎక్కి బల్లకట్టు బద్దెల్ని గట్టిగా పొట్టుకుంటా.

"ఏవూరన్నోవ్? యిద్దు రుండట్టుందే—ముగ్గురే!" అని యిశారించాడు శివయ్య, బల్లకట్టు దరికి సేరుత్తా.

"మాది మాలపిల్లిలే—ఎక్కువేందే, ఎక్కురా చుబ్బియ్యా—అఁ యిగ పోనీ బాబూ. నూ కోటయకొడుకు వెట్టా? ఆ రెవురూ, ఆ కూకునుందీ?"

"నాతమ్ముడు కొండయగాదూ! రెన్నాల్నుంచీ అయ్యా లెగవకబోతేనూ-"

"ఎట్టెట్టా! పిల్లలు మంచోళ్ళే! మీఅయ్య మంచోడు గదూ? కాత్తె ఆయిననూ ట్నిలబెట్టండి బాబూ! నే పువాకు అమ్ముకుండే దినాల్లో మా మాట మంచుండేదిలే మాయిద్దురికీ! రేత్రి కీడే పొండుకుంటా రెట్టా? ఈడ పాకా వుండదిగా మరింకేం! పిల్లలు—సీకట్లో బద్రవంయ్యోవ్! సన్నా సెదవ లాల్లీళ్ళు సేరి రేతుర్లు తుమ్మలుగొట్టి బల్లమీ నేసుకుబోతావుంటారు, కాత్తె నూసుకోండి! బయివేట్టిగానీ, మీ అయ్యుంటే ఎటనయినా అడలుగాదూ! అదెప్పుడో ఓపాలి, ఈడ ఆపాలెం రాతారిబోటు, బొహు బిర్రుగా బత్రీ అయి, బోటేఁవో బోర్లబడి, ఆ ఎక్కిన ఒందదెగ్గిరదెగ్గిర జనంలో, కొంత మంది ఈత్తా, మరి కొంతమందేవోఁ బుటకలేత్తావుంటే—రేత్రి అంత దైర్నం ఎవురి కుంటదయ్యా? ఆమీన మీఅయ్యగాదూ యీదుకుంటా పదిపన్నెండుగురి ఒడ్డుకు లాగిందీ, పొయినాళ్ళు పోంగా! పొర్దలిటుంటే బల్లకట్టెటు బోద్దాడికీ! ఆ ఆవులిత్తా సచ్చిం జనం, ఆ యిసయం తలుసు

కుంటేనే గుండె బేజారవుద్ది!—దిగండి దిగండి—దిగవేందే యీరాం—పొద్దు బోయింది. ఎల్లొత్తాం బాబూ—బద్రవయ్యా—" అంటూ మడిసీమడుసులు యెవరు బలానా రయిందీ తెలవక తలికే సీకట్లో మళ్లీ గట్టుమీన సెట్లల్లోబడి, ఒచ్చిన యిగ్రహాలు ఒచ్చినట్టుగా ఎటువటు జారుకుండై, తపతపమనుకుంటూ.

"నాకు తెలవదే!" అనుకుండాడు కొండయ్య బద్దెల కట్టనే కరుసుకుంటూ.

"దిగవేందిర కొండయ్యా?" అన్నాడు శివయ్య, బల్లకట్టు కట్టేత్తా.

"జనం అవజాన సేత్తే బోహు పెవాంచవే!" ఇసయం తూకం గుంటంలో కొండయను మైకం కమ్మింది.

"ఓరి కొండయ్యోవ్? ఇయ్యాల నూ బల్లదిగవేందిరా ఆకలైస త్తంటేనూ?"

"అది మునిగింది నిజవేసంట్రా?" బల్లకట్టుదిగాడు కొండయ్య, ఈరంగంలో దుష్టిబెవిసి నోడికి మళ్లే.

"వారి పానీరా, ఎవుడో సోంబేరెద వన్నాడంటూ! బువ మూ టేడ బెట్టా—యీడుండిగానీ, అ మ్మయ్యా లేం జేసిందిరా బూలోకీ—నూ దినా వంట్రు కొండయ్యా? ఓ ర్దావేరా కడుపుగాలి సత్తుంటేనూ!"

"ఈడ సీకటి యిట్టుండదేరన్నా?"

"ఓ ర్నవుంద్రా ఆడా—గోగాకుయిగురంట్రా—వుచ్ వుచ్—కండా, రెల్లా, మూల్లా—వాస్దీనె—యీడ సాంబారా్కరం వుండదరయ్యో కుయ్యోడా—రారా రారా, ఈడకూకోరా—యీడు త్తలో దేందిరా?"

"పెరుగుబువ కట్టిందిరా"

"అ చ్చరేగానీ, వువాకు దెచ్చావంట్రా?"

"అమ్మ సంపుద్దనీ—"

"ఓ ర్సన్నా సెదవా! అందుగ్గాదంట్రా నిన్నంపలా టాడిచ్చేదీ"

"అది గాదురా, తెలుత్తే సంపుద్దని రొండే ఏసుకొచ్చారా?"

"మరి నానుత్తావేందిరా బుల్లోడా, మాట జార్నీకుండా! అవితే అయ్య ని న్నీడ పొండుకో మన్నాడంట్రా?"

"అటనే పొండుకోమన్నాడుగాని — మనయ్య బోహు మంచోడు ందంట్రా చివయ్యన్నా? మరె - ముంగలే - నన్నుకొండకు పంపిత్తానా ాగా అయ్యా!"

"కారడేందిరా—కోటయ కొండట్రా?"

"యీరాయ్, సూరాయ్, బూసాయ్, నేనూ—మరేవోఁ—"

"వారి సాల్లేరా యిరగబొడిసేవోళ్లు లేకా! ఏందమ్మా నూ ఎల్లి పగల్దీసే దాడా?"

"నీకేవయ్యా మేం బోతే? అయ్య పంపిత్తాన్లా?"

"వారి పోరా, యీడ గెడెవు రేత్తా కూకుంటారూ!"

"మరి, అయ్య సెప్పలేదయ్యా సిన్నోడ బల్ల నడపమనీ?"

"ఎంత సెడ్డా పద్దాకనే పనెట్రా!"

"ఆఁ, అయ్యకు దెలుత్తేనా!"

"వారి పోరా నీ కొల్లు మా బల్చింది! నాకుమటు కుండదెట్టా?"

"నీ మల్లుగర్ర నా కిత్తావట్రా?"

"నూవేందిరా గోవాఁరికి మల్లే పొట్టుకుంటా! ఆల్చిచ్చాల్చిందే—ఏవీ, ముంగలాపు, వాకిటిచ్చి—బూదింట వఁయిుంద—నీ ల్దాగుదాం దా!"

"యీడ గోండ్రుకప్పలుండవ్గందా—మరి ముల్లుగర్రేవంట్రన్నా?"

"తార్రా నువ్వా, యిదేందో తిరుగుడు గుంటేనూ! అయితే బూసాయి నిజం గొత్తాడంట్రా? బల్ కుశాల గుంటదే! యీడీ తెడ్డేందంటా యవ దానం మిగిలి పొతుంటే! కాత్తె పాకలో సాపుంది యిట దీసక రారా, యీడ కూసేపు కూకుందాం."

"యీడా ఎలుత్తర్లేంది ఎట్టయ్యా—"

"కెంచామెడు యీనుత్తావట్రా? ఏందో యీన కొండ కెల్తాడంటా—" అంటూ కాత్తె ఎడంగా వుండ పాకలో కెల్లి ఆపీడ సీకట్లో దేవులాడి సాప బయిటి కీడ్చుకొంటూ శివయ్య ఎలికా బొలికా కాత్తె లెక్క ఎంటు బడ్తావుంటే.

"దారా కొండయ్యా, యీడ కూకుందాం. ఏది పువాకూ—సుప్పెట్టి దెచ్చావట్రా?"

"చల్లే నయం, నీకాడ లేదెట్టా? యియ్యా లెట్టా గబ్బా?"

"యింద, కూత్తె నోట్లో ఏసుకో—ఎవురన్నా ఒత్తావుంటారుగా."

"ఏఁ వొత్తారో! యీడ యింత సీకటి గుండదేం దబ్బా! యీమర్రిసెట్టు మా వీానమీాన కొచ్చుండ్దేం! అయ్య యీడ ఒంటిగా ఎట్టుంటా డబ్బా— అయితే ఆడెవుడో యిందా కనిపోయింది వుట్టిదే నంట్రా?"

"ఎవుడాడూ—ఆళ్లా, మాలపిల్లిసంచూ! ఏందో కూశాళ్లే పానీరా."

"మొదు లీడ జనం మునిగింది నిజవేఁనంట్రా?"

"ఆ యవారం నే నోపాలి యిన్నాలే! ఎట నంటావా? పిల్లా జల్లా, ఆడోరూ, ఓ నలబై పెసిల్కు ఆవులించి పానా లొదిలారంట! ఆల్లల్లో కాత్తే యీాత దెలిసుండ మొగోల్లు సందట్లో సల్లగా యీ ఆడోళ్ల మెల్లోవి అందిన కాడికి గుంజక పొయ్యారంట! మాపెద్ద జాతల్లేరా, యింటుంటే ఎటనో బోయింది పానం!"

"మరి నుడుసు లావజాన సత్తే దెయ్యాలై ఆడే తిరుగుతా వుంటారంట నిజవేఁనంట్రా!"

''యియ్యన్నీ సన్నాసిమాటల్లేరా! అయితే మొటుకూ, యీమద్దెనే ఓ తమాశ జరిగింవంట కొండయ్యా! ఓపానముండ మడిసేనంటా, రేత్రి నడిగెడ్డ బొహు తొందరపనిమీాన యీగట్టునే పోతావుండాడంటా! కాత్తె బాగా పొద్దుబొయిందంటలే. ఆమడి సావజాన దొబుదొబ్బున పోతావుంటే— 'యిహి హి హిహిహీ—' అంటా గిలగిల ఎన కెవురో యికిలిచ్చిన ట్టయిఁదంట—మ రా మడిసి ఏ వాఁలోసిత్తా పోతావుండాడో—సెట్టుమీాన గువ్వలు కావాఁలనుకుంటా కాత్తె లెక్క పొయ్యేతలికీ—బో టెక్కుతా వంటయ్యా' అనెవురో సెవుకాడ పుసపుస మన్నట్టయ్యా—అట్ట కాత్తె ఎనక్కి తిరిగి నూశాడంటా, బోట్టేవైఁనా ఎనికీడ్తే ఒత్తుండ దేవాఁనీ-ఆ డెవురూ లేరు! యీాయవారం ఎట్టాటి దైందీ గబాల్న మడిసికి తగిలేతలికీ-ఆవజాన నీలుగారి పొయ్యాడంటే నమ్మాల్చిందే-ఎంటనే కాలవలో ఏందో పెలపెలమందంట— ఓరయ్యా ఓమ్మా అ నరుపులంట—"

"ఓఅన్నోశివ్—చివయ్యన్నోశివ్—" ఒనుకుతా శివయ్యను గబాల్న వాటేసుకుండాడు కొండయ్య.

"ఏందిరా—పందిరా కొండయ్యా-"

"ఆ ఎల్తు రేందిరా—"

"యాడ్రా?"

"ఆతల గట్టు—సిట్ట దగ్గిర—దెయ్యం—కొరివిదెయ్యం—"

"తన్నండ్రా ఎదవనూ—ఆ డేం లేందే?"

"అదేంరా—అదిగో—ఏందో—కదులాడ్తుండది—అ డ్తండది!"

"యాడ్రా—ఎవురామడ్సీ? ఓరామడ్సులూ?" అ సరిశాడు శివయ్య.

"మాది తుమ్మలగుంట, సింతపల్లి పోతుండాం లేవయ్యోవ్! బల్లకట్టు మడిసి వెట్టా?" అంటూ సిన్నలాందా రాడిచ్చుకుంటూ దచ్చినంగా వెల్తుండా రెవురో మడుసులు, అటు దిగువ తుమ్మలగుంటనుంచి కావలగట్టుమీద ఘాటకొత్తా.

"ఆఁ మేవేఁలే, ఏవూ రెల్తుండారనీ—వూరక నేలే".

"ఆళ్లు మడుఃసులే నంట్రా!"

"తొక్కండ్రా ఎదవనూ! పానం బోతే అడలు బుట్టీ! యిట్ట సెతఁటు కారుద్దేరా నీ ఒల్లూ—ఓ రదురుపచ్చీ!" ఆ నో సరుపు సరిచాడు శివయ్య, కొండయ్య యీపుమీన బలంగా.

"అయ్యో సత్తిర్రా చివయ్యా! యిందుకేనయ్యా తోడుపొండుకోను రామంది? యిం కీరేత్రి కీడుంటే పానం ఆవులియదంటా! నే యింటికి బోతా!"

"మె డిరుగుద్ది!...........ఏందో కొండకు బోతాడం టీ మొగోడు!"

"వూఁ ఎల్ల కీడ కూకుంటారు! అయ్య పంపిత్తాన్లా? నా బజన్నెక్క లేద బెట్టావబ్బా-ఏందన్నా ఆడేందో యినిపిత్తుండదీ-ఏందో అరుత్తుం డైరబాబో"

"ఓహాఁ—ఓహాఁ—ఓహోఁబీహీ—ఒహా ఓహోఁబీహీ—" అంటూ దూరాన యినొచ్చుద్ది ఏందో బజనకు మల్లే.

"సంపుతా ఎదవా అరిశావంటే—యాడ్దోమీ నాకు మల్లే వుండదే—"

"వుఁఒహాఁ—వుఁఒహాఁ—ఒహోఁబీహీ ఒహోఁ—హోల్భాయ్—ఎఏఁ, ఆఁఎఏఁ—"

"వుప్పుడంట్రా యాడన్నా మి నాలొచ్చేదీ! నాకు దెల్చులేరా, అయి మినాలు మోసుకొత్తయ్యంటా! వామ్మో, ఓయ్యో— నేబతికన్రా

చివయ్యన్నోవ్"

"ఎహె గట్టిగా అరమాకా! తాల్రా ఎవురోమీనా ఎక్కాల్తుండట్టుందీ—ఒరె యాడవకురా కొండయనాయనా! వుప్పుడు నే నేం సెయ్యాలబ్బా—ఒ ల్లిట్ట దిగజారుద్దేందీ—పున్నానికి అయి కాదు గందా—కొండయ్యా? ఓరేయ్—యాడికిరా ఎల్తుండావూ—ఒరి కొండయ్యోవ్—ఆడ నిల బడ్రా ఒత్తుండానూ—లగెయిమాకురా—"

"వామ్మో ఒత్తుండయిరో—" గట్టు దిగి డొంకనబడి ఒల్లు తెలవకండా లగెత్తుండాడు కొండయ్య.

"ఒహోం(బిహీంహోం( ఒహోం(బిహి—హాల్బాయ్—"

"ఓరి కొండయ్యోవ్—ఓరి కొండయ్యోవ్—" కొండయ్యెంటే లగె త్తుండాడు శివయ్య గాబరా ఎదురొమ్ములకు తంతావుంటే.

"ఓబల్లకట్టాయినోవ్—ఓ ఎవురయ్యోవ్ లగెత్తేదీ—" అంట్గా ఎనక గట్టుమీన కేకల్లెగిల్లెసినై.

"ఓరి కొండయ్యోవ్—నన్ను సంపుతుండయిరా— లగెయి లగెయి—" నరాలు సల్లొదుల్తుండయి శివయ్యకు.

"ఓ ఎవరయ్యోవ్-నిలబడూ, నిలబడూ-" ఎనక లగెత్తుకొత్తుకుండా రెవరో

"సచ్చాన్రా చివయ్యన్నా—"

"లగెయి—లగెయిరా— కొండయ్య—వామ్మో—" కాల్జారి, దిమ్మదిరిగి బొక్క—బోర్లా బూమ్మీనపడుండ కొండయమీనగా పల్టీలేత్తా సుట్టుసుట్టుగా పడిపొయ్యాడు శివయ్య, దుమ్ములెగుపుతా.

ఎనికీడ్తే దబాదబా అంగలేసుకుంటా, ఎగశాస దిగశాస బుసలిడ్తా వుంటే, రైనుబండికి మేకు దిగేసినట్టు పెడీల్మని నాగిపోయిం దాయిగ్రహం, బూమ్మీన సాపసుట్టగా పడుండ కొండయ్య శివయ్యలకెల్లి మెరుత్తుండ కల్లతో యింతగా సూత్తా.

"ఓ ఏవిఁయ్యోవ్? ఈపిల్లలు బంగారంగానూ, యాడో దడుసుకుండట్టుందే—అరెరెరెరె, యీ కోటయ్య పిల్లల్నేవిఁటికి తోలాడబ్బా!... ఓ ఏవిఁయ్యోవ్—నూ శివయ్యవు గాదంటయ్యా? ఓయి మీ పిల్లోల్లు సల్ల

గుండా! యిదేందియ్యా అట లగెత్తుకొచ్చి పడిపొయ్యారూ?"

"నన్ను సంపమాకే తల్లా, నే నేం ఎరగనే—" అంటా లెగిసిన మద్ది లోనే ఒనికిపొయ్యాడు శివయ్య.

"ఈపిల్లోణ్ణి దొంగల్దోలా! నే సాకలి గురవాయిని బాబూ—యీయాయ వార వేందంటా!"

"ఆఁ, అ య్యేట్టనే అంటయి లే—నూ ఎటుగా ఒచ్చా?"

"ఎహె తాలూ-పిల్లో డాపజాన పడుంటే—అరెరెరెరే, దిమ్మరబొయ్యాను పిల్లోడు కాత్తా—యిటు రావియ్యా నీ చివయ్య దొంగల్దోలా—యింకా సయం నే మీనావెంట పోకుండా యిటొచ్చా గాబట్టి—"

"కొండయ్యా—"

"సంపు తండయిన చివయ్యానోవ్—"

* * *

ఆ దెబ్బదెబ్బ అయిదార్దినా ల్దాటి శివరేత్రి పొద్దుట కసంగా గానీ కొండయకల్లు నికరమైన సూపుకురాలా.

"అరఅరా, తోయిరేందిరా పెబనూ—" గబాల్న తాడేసి లాగినట్టు మంచమ్మీన లేసి కూకుండాడు కొండయ్య బిత్తరబోతా.

"నే ఆదిలచ్చిని—పానం దీశావుగదంట్రా కొండయ్యా! ఎన్ని పెబలొచ్చి నయిరా కోటయ్యకొండకూ?" అనింది ఆదిలచ్చి, కొండయను యింతెగా సూత్తా.

"యిదేందీ—చివయ్యన్నా?"

"చివయ్య కొండకెల్లాడుగా, కోటయమావకు కాత్తె కుశాలగుంటే!"

"ఆఁ, యీఁ—మాంయ్యతో సెబతా నుండు—ఓ అమ్మోవ్!"

"యియ్యాల చివరేత్రి, యింకేం బోతాకొండకూ! నునూరి రతానికి నూసోకా ఎట్టాటి రంగు రంగులగుడ్డ లేశారో—"

"మొదు లా డెందుకెల్లాడు కొండకూ?"

"నొబ్బరికాయ కొట్టినవ్వని పంపీలా కోటయనావా—నీబజన్నెక్క లెత్తికెల్లార్రా చివయ్యా!"

"ఆఁ, యాఁ,—ఓలమ్మోవ్—"

"యీరాయా ల్లీడే వుండార్రా కొండయ్యా! తెల్లారక తలికే రంకుల్రాటాం ఎక్కి కూకుండార్రా!"

"ఆఁ!"

"ఓ చాయిబే, ఎలుఁగొడ్డును తెత్తేనూ, సూరాయి దాని కనకమాల కల్లీ, పుల్లతో పొడి సేతలికీ—"

"అట సెప్పవేందే నాకా త్తకోకలబుల్లా—యియ్యాల ఎట్టుండా వుంటుది, పదవేందే ఎటో సూత్తావూ!"

# నెరుపు వయసు

'సచ్చి యాడుండాడో, పెద్ద బతుకు బతికిపొయ్యాడు. మొదులు ఆయినే వుంటే తనకు కొరవేం వుంటుందీ. ఎందుకూ తంబాలకు మల్లే ముగ్గురు కొడుకు లుండారు. సరే యిద్దరికి పెల్లిళ్ళవనే అయింది గదా. అయి, ఆ మొగరాయిడు గెజ్జలగుర్రాల సేత, తన్ను ఎంతలెక్కకుబడ్తే అంతలెక్కకు ఆర్రాని యన్నీ అనిపిత్తుండారు గందా. మరి యీ సిన్నోడి కేం వుండు పుట్టిందంటా? పెల్లి ఆవనోడూ అవసట్టుం డక్కర్లా? కనపడ్డ ఆడగూతుర్నల్లా అట్టా నూత్తూ ఎనికీడ్తే పోల్చిందేనా? సరె పుట్టిందే అనుకో. నే అమ్మను గందా! పెద్దోళ్లిద్దరూ పెల్లాలెస్సేతుల్లో సిక్కి తన్ను గవిరిదేపికిమల్లే ఆడిత్తుంటే, యింకా పెల్లాం మొగం యెట్టుంటదో తెలవని యీడికే యిట్టుంటే, యిగ తన వూ సోరికి పడ్తుండట్టూ? ఈడ మొగోడే లేనట్టువుండ ఆడగూతుర్ని కాత్తా ఏ డామడ ఏటా తలగాని ముడి బిగియకపోతిరి. రత్తమ్మ కూతురు సామ్మకు యాడో ఏటాతల ముడి! హుం! వూళ్లో ఆరంతా ముక్కుమీన ఏ లేసుకోలా. ఎందు కేసుకోగంటా? అ దేవంత వుండ సంబందవంనీ? ఎంత కలిసొత్తా ఒల్లు ఒంచుకుంటుంటే మెటుకు ఆసలాడ ఎనకేం వుండక్కర్లా? యిదిగో నాలుగెకరాలు. అదిగో మామిడితోట. కాదూ, ఓ వుగాకు యాపారం, ఓ నేతియాపారం అచలు అయ్యేం లేం పెట్టనంటా? పదెకరాలు మకతాకు తీసుకుండాడే అనుకో. సివరికి గెడ్డీ, మా ఒత్తే జనపకట్టే, యియ్యే గదంటా మిగిలేదీ! ఒకేల నాలుగింజలు మిగులుంటే మొటుకు తనూ, యిద్దరు అప్పలూ, పెల్లాం, పిల్లోడూ, యీరంతా సమచ్చరంపొడుగూనా బతికుండాల్చిందే నంటావా? పిల్లోడ్ని బుద్ధిగలోడూ, పుట్టుగలోడూ, కట్టబడి ఎన కేసుకుండే లచ్చనాలుండై, ఐతే మొటుకు ఆ మిగతాజనవుం, ఆపదావండ ఏటా తల చంగి తేవంటా? తను పెద్దదైపోతుండే. కూతుర్ని నూడాలని జెమెత్తే ఎట్టా! ఆడీ పిల్లోడూ యీడేడ్నో దగ్గిర్నుంటే తను యింకెన్ని సెక్కిరాలూ ముంతకె జ్జాయాలు తీసికెల్లదూ! ఆది కాపరాని కెల్లినాక తను మూడు చార్లగా ఆడ కెల్లింది. ఏటా ఓపాలే గా. తొలూసారి పురుటిగ్గూడా యీడకు

పంపియకపోతిరి. ఎంతన్యాయం! అబ్బ, ఆబండి మీన బడి యీ బండి మీన బడి, నడిసినంత లెక్క నడిసి, కడాకు దరికి సేరుకుండేతలికి మిసినీ పిండిబట్టి నట్టు ఒల్లంతా ఆలెక్కనయిపోయి, ఎల్లిన పద్దినాలూ పడకేత్తే, మరసనాడు మల్లీ పయానవేఁగా! పెద్దోడేంసేత్తుండాడో, ఆడిపెళ్ళాం ఏఁవంటుండదో, సిన్నోడేం సేత్తుండాడో, ఎవురెనికీడ్తే ఎల్తుండాడో, ఏకాడికీ వుత్తబెవేఁ గాని, నామొగం యీడేఁ పీక్కదిందావఁనో! పోనీ యింకో రెన్నాలు ఆడే వుందావంటే, దానాడబిడ్డలు సెరోరోకలి దీసుక ఆణ్ణించి ఎల్లేదాకా తెఁ బొడవరూ! ఎల్లొత్తానంటే, 'ఆఁఎల్లొద్దుమరీ'అంటా గుడ్లురిప్పుతా ఎల్లేదాకా సూత్తా ఆడే నిలబడ్తారు. పిల్లోడిపేరు చుబ్బరామయ్యంట. చుబ్బరామయ్యేంది గోబ్బిరకాయకుమల్లే! మరి ఆడపెత్తనవంతా అల్లుద్దూరేగా. దీని కచులు నోరుంటేగా! ఎట్ట కాపరం సేత్తుండదో ఏవోఁ! సక్కంగ ఎన్నముంతకు మల్లేవుంటాడు పిల్లోడు, నిగనిగలాడ్తా. అల్లపోలికే అయ్యో దేవుడా! మరి చుబ్బరామయ్యాంటే అనుకోల్చిం దేం వుంటది. సక్కగా లచ్చిమ్నారాయిణ పెడ్తే యీల్లదేంపోయిందా! సిన్నఎదవ! గుమ్మటావుఁకుమల్లే వుంటాడు ముద్దొత్తా. మూటయిప్పి, సెక్కెరాలూ, ముంతకజ్జాయం, పొప్పుండలూ, సెరుగ్గడలూ బయటపెట్టేతలికి, పడ్తా లేతా ఒచ్చి ముక్కనా నోట్లో ఒల్లంతా పాకంబోసుక ఏఁవెగి రెగిరిపడ్డాడు ముద్దుపచ్చి! వరమ్మ ఏం మురుసు కుండది! అదెవుర్రా అసంటంటే, ముంత కాజ్జాయం సీకుతా, 'అమ్మా-మ్మా-మ్మా-' అనంటా తఫాకుని ఒళ్లో ఒచ్చి పడ్డాడు సిన్నముండ! ఏం సేత్తుండాడో నాయిన! మాట లొచ్చుంటయిబాగా. ఏం ఒచ్చుంటే ఏం లాబం! ఆమేనత్తముండలు కాత్తా అల్లపక్కన తరిబీదు సెయికుం డుంటారూ యీ పోలికీ? మొదులీ వరమ్మకు నోరుంటేనా! కొత్తపండగ దెగ్గిర కొచ్చింది. ముద్దుపచ్చికి ముంతకజ్జాయం, సెక్కెరాలూ, చిలుకుసొకాయా, గజ్జల సంచి యిత్తికల్తా. ఈ పాలన్నా వరమ్మకు నేతసీరా, రయికా యిత్తి కెల్లాలి. మొదులు యీ యెంకాయమ్మ డబ్బిత్తేగా యియన్నీ అయ్యేది? రూటనో .యెనకేసు కుండది కాత్తా ముంగలగా దీనికి అప్పిచ్చి కూకుంటి నేంది. ఆ, యియ్యకుంటేనా! బజార్లోనిల్దీసి దీసెవార వేందో ంతుదేలవనూ

ఏదెట్టుండా యీ సెయిబాద నన్ను యాడికన్నా కదల్నిత్తేనా? బాసే వుండది పండగముంగల ఒంటిసేత్తో. వుండుండి ఒచ్చుద్దేం యీ పంట పడి సావా! అయితే మొటుకు పరమ్మకాడికి పయానంకట్టకుండా యీడ కూకుంటా సెట్టా—హు!' అంటా రేత్తిరి బువ్వదిన్నాక ఒంటిగా మంచమిన్న యిశారబడ్తా కూకుండ రత్తమ్మకాడికి సిన్నకొడుకు నాగబూసి ఒచ్చి, నూర్లూ, గూళ్లూ దేవులాట్టం మొదలెట్టాడు.

"వుప్పుడేందిరా గూళ్లే దుకుతుండావూ?"

"ఓ బేడ్డబ్బులు కావాలే!"

"ఆఁ యీడేం కుప్పేసు కూకోలా సన్యాసిముండలకల్లా దాంబోయిం! సాల్లే అయన్నీ కెలకమాక—"

"ఏందమ్మా నూ వుప్పుడందీ?"

"ఏందా—సన్నాసి గూత్తుర్లంతా సేత్తే సరి—"

"ఓడా యదవా?"

"యిగ నీకు పిల్లనీమంటే ఓడిత్తార్రా? ఆపలేంటికిలే యీ పురాణవంతా! పెద్దోళ్లిద్దరూ ఎలగబెత్తుండారు సాల్లూ!"

"వుప్పుడు పెల్లి ఓడు కావాలంటుండాడే? అదే ఒచ్చుద్ది ఎతుక్కుంటా! ఓ బేడ్డబ్బు లిద్దూ తెల్లార్తే పనుండదీ?"

"తెల్లార్తే పనుంటవేందీ, రేత్తిరి బేడ్డబ్బులు కావల్సొటవేంటి! ఏందిరా నీయవారం—అచ పేవింటికి లే—నా కాడ లేవు పో."

"ఆఁ, వుంటయిలే తెద్దూ?"

"పోయి అన్ననడుగు."

"ఆఁ, ఓపక్కయియ్యాలో రేపో పిల్లోపిల్లోడో పుట్టబోతుంటే, అన్న మొటుకు కరుజున పట్టంలా! వుంటయిలే తెద్దూ?"

"యీ మా తల్లికి పురుడొత్తుండది గావాల్ను. యిగ యాడబత్తే ఆడ నేదేనికీ దిట్టిబొమ్మాలే! కిందటికొత్తపండుక్కు గావాల్ను, వరమ్మనూ పిల్లోణ్ణీ నూసింది. ఎల్లియీపాలన్నా దాన్నీడకు తెత్తే బాగుండు, కొన్నాలు వుండి పోద్ది."

"యాడికే నా వుప్పు డెల్లేది? అన్న ఏవనుకుంటాడూ. యీడ ఎవరూ లేనట్టు యాడ్నో దూరానుండ కూత్తురో కూతురో అంటా వేందీ, రేత్తిరేల ఎప్పుడు సూసినా?"

"అదంటే చరి లబ లబ బాదుకుంటారు! యీళ్ల సామ్మెం దిన్నదినో—"

"నా సేరత్తుండది సాలక యింక మేంగూడా దేనికీ—"

"యిది గిందుగ్గాదూ యీడ ఓచనం వుండ నంటుండదీ? యింక పయానం గట్టుక యీడ కూకుంటాగా—"

"యిదిగో? ఓ బేడ్డబ్బులు నే అడిగుంటానేగా నా అవజాన బాగోతం యిప్పుతుండదీ? నేనేవో తెల్లార్తే నికరంగా జనపనార దీసి సెన్నాకోలా కిద్దావని నిన్ను బేడ్డబ్బు లడిగానా, నువ్వేమో అయ్యన్నీ ఆ ఏటాతల సావబో సాత్తానంటుండావా, యింక నే నీడ దేనికీ? పోతుండా?"

ఒబ్బిగిదీ వరస. పిడకాబోడకా సేరేత్తా ఏవింటికైనా నాలుగురాళ్లు దాసుకుంటే చరి, జోరీగ కరుసుకుండట్టొచ్చి కరుసు కుంటారు. పానీ ఓ కొడుకులంటా కోడళ్లంటా యీపెద్దదాంతో ఓ పక్కేన పోతుంటే, తన గాల్చిందె మటుకు ఏ వుంటదీ? యాడో దూరానుండదానికి పెత్తుండానని ఏకుత్తా రేం దంటా! ఏడాదికో పాలన్నా ఆకుగూతురికి కూసిని ఏమన్నా ఎత్తి కెల్లకొర్లా? ఏం, ఎందు కెత్తి కెల్లనూ?......పండక్కు ఒత్తానని రంగయ్య సేత రాపించిన జాబు సేరి, ఒచ్చుద్దనుకుంటా వుంటారు గావల్ను. యింతలో దీనికి పురుడేం ఒచ్చుద్దిలే. వుండకేం సేసుద్ది కొన్నాలూ! ఈలోన తిరిగి ఎట్టనో ఒత్తానాయెనూ. ఏదెట్టుండా ఈసెయితోసా వొచ్చిం దేందంటా! యాడకో వుండుండి గుంజుద్దేం? కాత్తె మూటాముల్లే వుంటది యాట్టనబ్బా దూర పయానం? ముద్దు ఎదవ ఎట్టుండాడో! ఈపాలి ముంత కజ్జాయవంతా ఆడే దింటాడు......అబ్బ ఏం పీకుద్దీ సెయ్యా...వుంవు-బగమంతడా...

* * *

"పెద్దదానివి నా యీడ లేకుంటే ఎట్ట జరుగుద్దే!" అన్నాడు పెద్దోడు మాటబట్టుకుంటా.

ఫూఁ, తనిప్పుడు కావాల్సొచ్చిందేం? యిన్నాలూ అళ్లు తనమీన వంటలు గిరవాటు పెత్తుంటే యాడకా నొచ్చిందో ఈపెద్దవీ—అదిగో గుమ్మంకాడ తొంగి సూత్తా ఏట్టా మెటికె లిరత్తుండారో తనకల్లి! యింగ దేనికి ఈడా—"వుఁహు, గేపొచ్చిందే!" అంటూ వా-క్రొత్తుకుంది తను.

పెద్దోడు సిన్నోడికల్లి సూశాడు. సిన్నోడు ఓమూల సెన్నాకోలు కఱ్ఱ మీసకు ఒరిగి ఆచ్చేసుడికిమళ్లే వాలుండాడు, గాబుకాడ నెవఁ రేత్తుండ బఱ్ఱె కల్లిసూత్తా. గబాల్న ఆ నెవుఁరుడు వుచ్ని గుటకేసి, రెండుకళ్లూ సూటిగా తనకేసి తిప్పి, మోరపైకెత్తి సూసింది బఱ్ఱె, రెప్ప కదల్నీకుండా.....రవిలు బండి కొండమీన్నుంచి పడదోసినట్టు లగెత్తుతావుంది.....తణక తణక దన్ దన్, తణక తణక దన్ దన్ తణక తణక......ఎత్తి రాతారిబోట్లో పడేసి గొలుసులు దెంచుకు లగెత్తికెల్లింది రవిలుబండి, దూకుడుమీనుండ గండు సీమకు మళ్లే మలుపులు తిరుక్కుంటూ. మూటేవీ — అయ్యో ముంతకజ్జాయా మ్మూటేవి—వుఁ—ఓ—మ్యో—లబలబ లావ్వావ్వా.....అబ్బ యిదేం పయాసఁ వమ్మో—యింకెంతలెక్క నడవాలో పాడుపీడా—అబ్బో యిదేం సెయిరో బగమంతడా — యింకొనయఁ మూట యింటికాడ పెట్టొచ్చా. పున్నెనికి మూటతో యీడకూడుకుబోతే యిన్ని మంచీలుబోసే పేపతుండదు — యీ కాళ్లు రెండూ గానుగలు లాగుతుండయ్యేంది...అబ్బ, ఇంకెంతలెక్క — ఓ ఏవూరమ్యోవ్ బండీ? ఓ నిన్నేనమ్యోవ్—నూ పాపయవేనా నాయినా! కిందటిచారి నీబండేగా పున్నెనికీ - ఆఁయింగ సా. పాపయ్యా వాఁ వరమ్మ ఎట్టుండది - చుబ్బరామయ్య ముంతకజ్జాయం టుండాడా - ముద్దు పచ్చి — అయ్యో నా మొగం సావా! యింతలెక్కా ఒత్తా మూట యింటో మరసిపొయ్యానేంది — ఆ ఆడబిడ్డ బిద్దురూ గోకలిపొన్నులు సూపియ్యరుకందా ...వరమ్మ ఏ వంటుదో-నాయిన, పిల్లోడు ముంతకజ్జాయవంటా నా ఒళ్లంతా పీకడూ......నే మొటుకేం జేయనూ, ఒంటిరెక్కపన్నైపోతే-ఆళ్లకే తెలుసుద్దిగా......ఏవోఁలే పిల్లనూ పిల్లోణ్ణీసూత్తే అంతేసాలు......యిదుగో వాకిట్లోకొచ్చి నిలబడ్డారూ - అందేంది ఆట్టసూత్తారు తన కల్లి......అఁఅఁ, కాత్తె బండి నిలుపు నాయినా - యిదేందే - బండి దిగలేక పోతుండదేం

తనూ. బలే తమాశే-సేతులూకాళ్లూ యాడవి ఆడ-చీలలు బిగిచ్చుండయ్యేంది ?

ముందల ఆడబిడ్డలు ఒచ్చి తన్నూ బండంతా ఏగాదిగానూసి ఎనక్కి తగ్గారు - మాటకోసం గావన్ను....పిల్లోడు పైకీ కిందికీ ఎగబాకుతుంటే వరమ్మొచ్చి బండిదగ్గిర నిలబడ్డది—“దిగవేందే అటనే కూకుండావూ — అబ్బ యిదేంపిల్లోడమ్మా కేతిగాడికిమల్లే-” అంత పెద్ద దయిందేం వరమ్మనోరూ— “రావేం దిగీ, దెయ్యంపట్టినోళ్లకు మల్లే సూత్తా-” యాడా—తను కదల్లేదేం—ఉచలిదేందీ—“గుజ్జూ, ముంతా, బల్లం—” అంటూ గబాల్న బండిలోనకు జొరబడి, అటీటూ సూసి బావ్‌మన్నాడు చుబ్బరామయ్య—తన్ను సెగో కాలూ పట్టుక గబాల్న కిందికి లాగి రాత్తామీన పడేశారు ఆళ్లిద్దరూ— “యీ ముంతాగుజ్జూ—ముంతా” అంటూ అమ్మసంకలోసేరి తనకల్లి ఏలుబెట్టి సూపిత్తా, పెద్దగా అరుత్తు ఏడుత్తుండాడు చుబ్బరామయ్య-“నువేంది వుండరా-యిశారీ నియవేందీ—” అంటుండది వరమ్మ—టూప్ టూప్ మనిపించారు రెండు రోకళ్లూ, ఇద్దు రాడబిడ్డలు—ఆళ్ల సేతుల్లో ఉయివుండట్టు ముందల తన కవుపీ లేదే — పోటుసాగింది — రోకళ్లు ఎగిరెగిరి పడ్తుండయి — “యీ గుజ్జూ ముంతా—” ఏలు అటనే తనకల్లి సూపిత్తా పిండి మరపడ్తుండాడు సుబ్బ రామయ్య—ఆ పిండిమర ఆపను తనకు చీలలు బిగసినై - రెండుగాదు నాలుగు రోకళ్లు తన మీనగా ఆడ్తుండయి - ఆళ్లంతా తనసుట్టూ యెగుర్తుండారు, ఒక్కొక్క పువ్వో గౌరితమ్మా అంటూ పాడ్తా.........

“ఓ అమ్మోవ్, ఓ అమ్మోవ్ లెగవ్వే లెగవ్వే, అన్నకు పిల్లోడు పుట్టా డూ—దబ్బున్రాయే నే యెల్లి యెల్లులిపాయలు తీసకె రావాలా” అంటూ సిన్నాకోలుకర్ర జారికిందపడ్డా యెనక్కి తిరిగి సూడకుండా లగెత్తికెల్లాడు సాగబూసి.

ఒంటిసేత్తో యెగిరికూకుని, లెగిసి పురుడు గదికి కాళ్ళు గుంజుకుండది తవమ్మ, లచ్చిన్నారాయణ, లచ్చిన్నారాయణ అనుకుంటూ.

# మార్నాల పండగ

రేత్తిరి అంత లెక్క పొద్దుపోయినా దురగప్ప కుమ్మరి గుడిసెలో ఆయిదం సెవింతే యింకా అట్టనే కాల్తా వుంది.

రంయ్యి రంయ్యి మంటూ గిర్గిరా తిరిగే కుమ్మరిసాన కుంయ్యి కుంయ్యిన కూత లేత్తా తిరగటంలా. సురసురా కుమ్మరిసానను గిరగిరా, సల్లసల్లటి బంకమట్టిని తెప్ తప్, సానపెట్టిన సన్న సేతులు లోపలంటా, పొట్టమీన, మెడల కాడా, తలల సుట్టూ సరిది సరిది ఒర సారసగా కుండలన్నిటీ కుదురుగా తీర్చటంలా.

కుమ్మరిసానకు సరసనే కుమ్మరి మురగప్ప కూకుని, నీలలో తడిపి వుండ బంకమట్టి కల్లి నిలకడగా సూత్తా, ఆలోసెన్లో పడ్డాడు ఎప్పటిన్నించో.

తెల్లారిందంటే—మర్నాల పండగ.

“అలిగి పుట్టింటికి లగెత్తుకెల్లింది పెల్లాం తిరపతమ్మ. పండగకి ఒచ్చే మడిసైతే యీయాల యిప్పుడో రాల్సిందేగా! యింకేం ఒచ్చుద్దీ? తనమీన అలిగింది. తెల్పో తెలవకో నిందలాడిందే అనుకో. తను ఎదవగా బుద్ధి తక్కువ పనిజేసింది కూడా తప్పేగా! ముంగల తప్పు తప్పే. బతిమాలాడి తీసుకురాటానికి దానింతట అది రాదని తెల్చికూడా తను ఎల్లలా? తనూ గింగదీసి కూకుండాడు. ఎందుకనీ? ఒకిదంగా ముంగల తప్పు తన కాడుండా అంతకి మిగులుగానే తన్ను ఎదవకన్న కనాకట్టంగా—యీనంగా కట్టేసింది. పెల్లాం ఒచ్చినాల్టిమించీ తను తాగుడు మానుకుండాడు. ఎంత కట్టమ్మీన మానిందీ దానికి తెల్పా? పెల్లామ్మీనుండే బెమతేగా తన్నిట్టా జేసిందీ? మరి యింత యవారం జరిగితే అదేవన్నా సూడగలిగిందా? లేదు. మరి యీయాల బాగుండకనే ఆ రోజున ఒకల్లిద్దరి బలంతమ్మీన ఒల్లు తెలవకుండా తెగదాకి యింటికొచ్చాడు తను.

“నువు తాగి ఎగిర్నా, యిట్టాటి సెండాలప్పన్లకు పాల్పడ్తావని నేసెప్పుడూ అనుకోలా!” అంది.

అంత పొద్దుపోయినా తనకోసం కాసు కుక్కోటానికి కారనం వుండే సేసింది.

తనేం మాటాడలా.

"ఆడకూతురు సామ్మెత్తికెళ్లి తాగుడుకు బోసే మొగాళ్లతో ఏ ఆడది మటుకు పెల్లాప్పుడు మళ్లే వుంటదీ? నా కాసుల్దండ ఏంజేశా?"

"నువ్వు మాట్టాడేదేందో నాకు తెలవదు. నేనయితే బుద్ధిపూర్వకంగా తాగాలని మటుకు తాగాలా. అది నీకు తెల్సిన యిసయమే!" వుండ యావాగ వేందో సెప్పాడు తను.

"తాగుబోతు మడుసులకు కూసేదీ సేసేదీ ఎట్ట తెల్సుద్దీ? నీ తాగుడూ తందనాలకుగాను యీడేం దండలు కట్టుకుక్కోలా! మా అమ్మ పెట్టిన దండ నాకొక్కటే. అది యియ్యాల నీ పాల్ల పడ్డది. యింత దుగమారగం జరుగుద్దని నాకు మటుకేం తెల్సుద్దీ?"

"యిదిగో, నువ్వు దండలు గిండ లంటున్నావు. నీ దండల్తో ఏ ఎదవకేం పని పట్టలా. మాటలుమటుకు జార్నీమాక!"

"ఆడ గూతురు యిట్టాటి పన్లెప్పుడూ సెయ్యదు. నువ్వు అంతకన్నా ముద నష్టకం. ఆ మొగాలు అప్పుడే తెలుత్తయి!"

"తెలుత్తయిగానీ, నీకు మళ్లే కెరువుకుసచ్చే యిడింబి గకానికి సేసినా తప్పలా—!"

"నువ్వా? గటోత్కచుడి ముత్తాత కొడుకు రాచ్చసుడివి! ముడుసుల్లో యిట్టాటోళ్లు మాకెప్పుడూ తెల్లా! యియ్యాల్టికి నువ్వు జతపడ్డావు. కాసుల్దండ ఎత్తికెల్లి తాగొచ్చావు పట్టెంట. దేనికీ? తెల్లారి నా మెడికగదీసి నవిలి మింగవంటా? యిట్టాటి మొగుడు దొరక్కబోతాడనే ఎన్నో దండాలు పెట్టుకుండా నాగారు బొమ్మ నల్లికి. యియ్యాల్టికి నీ పున్నెవాం అంట్టా గట్టుతెగి సేను తడుత్తుండది. యిగ సాల్దూ? నా కాసులన్నీ నువ్వే ఉరా యించుకు బతుకు!—" పెడీల్మని తలుపు మొగానగొట్టి ఎల్లింది యాడికో—

అసలు జరిగిందేందో మరసనాటిగ్గాని తనకు వయినంగా తెలవలా.

కాసుల్దండ యాడో పారేసుకుని ఒల్లు తెలవకుండా ఎత్తిబోసి—లెగొత్తు

కల్లింది! అమ్మ కాడ కూడని సాదించాల గావాల్ను! ఒకేల తను తాగుండాడే అనుకో. తాగుండాడ్తో ఆడగూతురు అట నేనా సెయ్యాల్చిందీ? కాసుల్దండ కతేవుయిందో ఆ బగమంతుడికే తెలవాలగానీ, తనుమటుకు అన్ని మాటలు పడి ఎల్లి బతిమిలాడి తీసుకొచ్చుకోను రోసం వుండక్కర్లా? — తెల్లార్తే పండగ. ఎట్టనబ్బా? పానీ, పండగ సాకుతోనన్నా ఒత్తే ఎవురేవంటారూ— యిగనేం ఒచ్చుద్దీ? పండగపూట ఎట నబ్బా ఒంటిగా — ఆ బగమంతుడే వుండాడు అన్నిటికీ —" లెగిసి, తడపిపెట్టిన బంకమట్టిని ముద్దలు సేత్తా వుండాడు దురగప్ప, సేసేది ఎట్టా ఏదయిందీ తెలవకుండా—

అమ్మ యింటో తిరపతమ్మ—

"తెల్లార్తే పండగే? యిగనేం వత్తాడూ? ఎవురేవన్నారనీ యిన్నాల్దాకా సన్నీడ కూకోబెట్టడం?" నిన్ను సూత్తే నాకెంతో ఇట్టవే! అని ఎట్టాటి సనువుతో మురిపిచ్చేవోడూ? అంత యిట్టంగుండేవా డేవుడూ యింత కాలం బాద పెట్టడు, ఏ ఆడగూతుర్నీ. ఏది ఎట్టాటిదయిందీ నాకేం తెలవదు గందా! పానీ, కాసుద్దండ కావాలంటే నేనేం కాదంటానా?—అట్టాటి సాటుపన్లు దేనికీ? అంత లావుతాగుడు తాక్కబోతే సత్తారా జనం? ఎంతో మనసుమీన కాసుల్దండ సేపిచ్చింది నాకు మాయమ్మ. అమ్మకు తెలుత్తే? వూళ్లోవోరంతా తిరపతమ్మ మొగుడు, పెళ్లాం కాసు లమ్ముకుని తాగుతుండా డని పుల్లిరాకుల కట్టే దెవురికీ? ఎట్టాటి అల్లుణ్ణి సంపాయించిందే, ఏనాడో సేసుకోవాలగాని! అని పొరిగిళ్లో రంటుంటే, మురిసిన మురవటానికి అమ్మ కెటుంటదీ? పచ్చిని కాకబోతే ఎవుర్ని సాదియనూ యీడకు లగెత్తు కొచ్చిందీ? ఎటనో యిప్పటిదాకా గుట్టుగావుండది గాని, తెల్లారి పండగ నాడు అల్లుడేడని ఆ రీసు అడగరూ? కాసులు ఎత్తికెల్లాడని రగిలి ఏమ్మాట్లు లన్నానో! మొదులు ముంగల తనెందుకు తాగి రావాలా? యిడింబని నన్నెందు కనాలా? మాయమ్మ పెట్టిన సొమ్ముమీన తనకేం అక్కుండదీ? అక్కుండా అమ్ముకుని తాగమన్నారా? సాటుసాట్న తాగుతుండ మడ్చికి యింత కరుజుగ్గాను డబ్బు యాణ్ణుంచి ఒత్తుండట్టూ? సేసిన అప్పంతా తీర వక్కర్లా మరీ! ఎప్పుడో తెలవకుండా తీసుకుని—ఎప్పుడో దేనికీ? అంత

క్కి ఒదటిదినం మట్టి గలిపి తలకు పోసుకోబోతా, లోనగూట్లో లక్క పిడతలో దండదాయలా? యిగనేం సందు అగుపిత్తుంటే? ఈ పకారం తిరుగుతుంటే, ఏ ఆడగూతురూ ఎట్ట బరిచ్చుద్ది? యిడింబి నంటు! మళ్లీ తిరిగి అన్నారంటే అసరూ? నాకు మట్టుకేం పట్టింది! నే నీడే కూకుంటా. యవారం ఎట్టొచ్చుద్దో సూత్తాగా. అయ్యా! ఎంత బెవఁ, నే నంటే! నంగనాసి!—

దబద్బు తలుపు కొడ్తుండా రెవురో. “పానం దీసి రాలేదు గందా—అమ్మ యాడక్కి బొయిందో—ఎటు సబ్బా—” ఎల్లి సల్లగా తలుపు తెరిసే తలికి—గబాల్న తలుపు యిరగదోసుకుంటా ఒచ్చి ముంగల నిలబడ్డాడు రొప్పుతా—సెర్లో తెప్ప మునిగినట్టు కాళ్లు బూవిలోకి గుంజుకబోతుండయి తిరపతమ్మకు.

“యిదుగో నీ కాసులు! బంక మట్టిలో బద్రంగా తడిబెట్టుకుండావు. పాపం, కాసులు కాసులంటా కలవరిత్తా ఎంత సిక్కి—బొయ్యావ్? తాడు దెగి మట్టిలో ఓటోటిగా పడుండయి నీ ధర్మమంటా!”

దిమ్మరబోయి నిలబడ్డది తిరపతమ్మ కళ్లార్పకుంటా.

# పాలపిట్ట గూడు పెట్టింది

"అప్పా అప్పా మనికి పాల్పిట్టొచ్చుద్దే—ఛ్ఛ్ అబ్బ ఎంత సల్లగుండయ్యే అప్పా!" అంటూ బల్ వుసారుమీన సందేల యింటికి లగెత్తుకొచ్చి, మంచ మ్మీన అప్ప సెంద్రమ్మకాడ ఎగ్గిరి కూకుండాడు కిట్టాయి.

"అబ్బ నీ పిల్లోడు సల్లగుండ! అట్టెగిరి పడ్తాడేం — ఏందిరా సప్పరిత్తుం డావు కిట్టా? నాకు పెట్టవంట్రా?" అంది వయసొచ్చిన సెంద్రమ్మ, కొప్పులో బంతిపూలు దోపుకుంటా.

"అబ్బ, యిప్పటికీ ఎంత సల్లగుండదే నోరూ! చుందరయ్య మంచోడు గదంటే అప్పా?"

"ఆఁ—ఎవురూ?"

"మన గుడికాడ యిసికి దిబ్బమీన దినాం కూకోడంటే చుందరయ్యా, ఆయినే!"

ఒక్కపాలి సెంద్రమ్మ పయిటెనక గబిక్కిన కదల బార్నయి — గుండె జల్లు మంటే.

"ఏందప్పా అట్ట జూత్తావు? ఆ యిన్నెరగవంటే—ఆ దినం సీకట్లో బాయికాడి కెల్లొత్తావుంటే ఎనికొత్తే ఒచ్చి నిన్ను—"

"తెల్చులే అరవమాకా—సెతుకుకి పొట్టుకుంటేనూ—"

"క్లె! నేనే అట్టాటి గిరజాల్దిరిగిన మడిస్నైతేనా! మైసూర్ పోక బొయ్యో వాణ్ణా!"

"అరవమాకిరా అయ్యొత్తాడేవోఁ!"

"చునయ్యకు సెవుఁడు గాదంటే—అప్పా ఆయ్యేడికెల్లాడే?"

"గాదె ఉల్లికయితే యిచ్చి రాబొయ్యాడుగానీ — యాడుండాడు ఆ యాబ్బాయీ?"

"ఎవురు చుందరయ్యా? మరే, నేనే, పిల్లెమ్మల్నెతుక్కుంటా పోతా వుంటేనీ, వూరకనే జోబిలోంచి బిల్లద్దీసి పెట్టాడే!"

"వూరకనే పెట్టాడంట్రా?"

"ఆఁ కాదే! పాల్పిట్టే ఎగురుకుంటా ఒచ్చి గుడికాడ సింసెట్టుమీన వాత్రేసీ, అబ్బ బ్బబ్బ—"

"ఆఁ ?"

"అబ్బబ్బ, బల్ పాల్పిట్ట అంటేనీ, అంతకాడికి మనగాడ్దాన్ని పిత్తా, యిటొచ్చి కూకోమంటా బిల్లలు పెట్టాడే !"

"ఆమయిన లగెత్తుకొచ్చా ?"

"ఆఁ. సింసెట్టుకాడ పాల్పిట్ట ఏం తిరుగాడ్తుండదనుకుండా అప్పా ? ఆడో తొఁగ్రుండదే! ఆడ గూడు పెట్టదంటే పాల్పిట్టా ?"

"ఆమయిన లగెత్తుకొచ్చావఁట్రా ?"

"అవౌఁ, పాల్పిట్ట యిప్పిత్తాన్లా చుందరయ్యా ?"

"ఆఁ"

"ఆడే కూకున్నా !"

"ఆఁ !"

"అప్పొవ్, నువంటే బల్ గురుండదే మడ్చికీ !"

"ఏందీ ?"

"మీ అప్పకు బిల్లలు పెట్టి ఎట్టుండయ్యో ఆడిగిరా, అన్నాడే !"

"ఓమ్మో !"

"నే అన్నీ ఆడే దిన్నాగా !"

"ఆఁ !"

"ఆడకి వూరకుండాడంటా ? మీ అప్పకి పాల్పిట్ట కావాలా అంటేనీ ఆవ్ అన్నా !"

"ఛీ యదవసచ్చినోడా !"

"ఏమ్మో, ఎత్తుకొచ్చి నాకీ రాదంటుమ్మో ?"

"నాకిత్తాన్నాడా ?"

"సీకటయినాక గుడికాడికొత్తే యిత్తాన్నాడే, ఎల్లవంటే అప్పా ?"

"ఓమ్మో !"

"ఏనాఁటికమ్మో బయిం ? నేనే సెంద్రమ్మప్పనయితేనా !—"

"ఆఁ ఏందిరా ?"

"చుందరయ్య ఆడే వుంటాన్నాడఁగా మ్మా—?"

"అయ్యొత్తే ?"

"ఏమ్మ ఒత్తే ?"

"నాకు ఒనుకు పుడ్తుండది నేవెల్లనయ్యా !"

"అప్పేదంటే బాయికాడి కెల్లిందంటాగా !"

"నిజంగానంట్రా—వుప్పుడే ఒత్తాగాని సెప్పమాకా—ఏమయిద్దో—"

* * *

"అప్పప్పా ?"

"అయ్యొచ్చాడా ?"

"రాలేదుగాని—ఏదమ్మా పాల్పిట్టా ?"

"తాలుండు—అబ్బ కల్లు తిరుగుతుండై—"

"తేలేదంటే—?"

"గూడు సెడ్తున్నదంట రేపురేత్తిరక్కొత్తే యిత్తాన్నాండ్రా—అయ్యొత్తాడు. కూంసేపు పొండుకుందాం—అరవమాక—"

# నుప్పు కడుపులు

బాగా రేత్తిరవుతుండది. ఆ యీదిలో సీకటిగాడాందకారం.

"మాదాకోళం అమ్మగోరూ!" అని అరిశాడు పోలాయి, వాములు అంటు కుంటే గొడ్డు అరిసినట్టు.

"యీడ బయింగుంటది అతల యీదికి ఎల్దాం పదయ్యా" అంది పోలాయి పెళ్లాం సుబ్బాం.

"ఏ యీదయితే ఏవేఁ బగమంతు డుండాలగానీ. పదా." అన్నాడు పోలాయి, సుబ్బాం బుజమ్మీన బరువు మోపుతూ.

"యీ యీదిలో ఎవురేం పెట్టరయ్యా, నువు యినవూ."

"నువు సందేల యాడో తినొచ్చావులేయే. మూలుగుతో కూకుండ నాకేడ దొరుకుద్ది గానీ."

"అదిగందుకే రగిలేది! మొదుట్నుంచీ నీకేందో లోన కొట్టుకుంటనే వుంది—అట్టు తూల్తా వేందీ—!"

"నాకిల్లు తిరుగుతుండై—కాత్తె పొట్టుకో—మాదాకోళం అమ్మగోరూ ?" గొంతు గుడగుళ్ళాడింది పోలాయికి.

"యిదేందయ్యా నువ్వూ, యింటో కూకోమంటే—"

"మాట రాటంలా—కాత్తె అరూ; ఎవురేవన్నా పెడ్తారూ—"

"నా సేతగాదయ్యా, నామాట ఎవరూ యిన్రూ."

"వుక్ వుక్—వుఁ—పొట్టుకో—"

"యిదేంది బాబో—మాదాకోళం అమ్మగోరూ ?"

"వుకుక్—అసె పెద్దగా అరూ—"

"అయ్యో—ఓ అమ్మగోరూ ?"

"అమ్మగోరూ—" పోలాయి గొంతులో మేకు బిగుత్తుండది.

"అయ్యో అట్ట జారిపోతా దేందమ్మా—అదేందీ—ఓమ్మో—అమ్మగోరూ—"

గబాల్న తలుపు దెరిసి "ఎవరక్కడా—ఎవరు, సుబ్బీ?" అని మెల్లిగా అరిశాడా మడిసి.

"యీరయగోరూ—" అంది సుబ్బాం ఒనుకుతా.

"అట్టా అరుస్తావేం, ఎక్కడా—లోపలికిరా దబ్బునా—?"

"అయ్యో పడిపోతుండాడు—ఓమ్మోత్త సచ్చాన్రా బగమంతొడా—!"

"ఏంటే సుబ్బీ ఏంటే—?"

"లాందరు, లాందరు—రఖతం గార్తం దదిర నాయినో—".

ఆ లాందరు ఎల్తురుకు బూంమ్మిన కాసయిడిసి పసుండ పోలాయి గుప్పిటి గోళ్ళ మద్ద, బెత్తెడు ఎడల్పు సుబ్బాం శరమంకండ రఖతం గక్కుతుండది దగ దగమంటా—

# కృతజ్ఞత

నామూగ ఘోషవిని "యిందులో చాలా కిటుకు వుంది, యిదిగో యీ దార్నెపో" అని నాకు దారి చూపించాడు మా కుంటుంరావుకక్కయ్య. ఆమాటలే రాకుంటే యీనాడు 'మూగజీవాలు' అచ్చుకాదు. ఎంతో సంతోషంగా నా కృతజ్ఞత నామార్గదర్శికి తెలియజేస్తున్నాను.

## పాఠకులకు విన్నపము

మా ప్రచురణలు ముఖ్యమయిన పుస్తక విక్రేతలు, న్యూసు ఏజంట్లు అందరివద్దా దొరకును. ఒకవేళ దొరకనిచో మాకు వ్రాసి తెప్పించుకొనవచ్చును. 6-0-0 విలువగల పుస్తకములు ఒకేమాటు తెప్పించుకొనువారికి పోస్టుఖర్చులు మేమే భరిస్తాము.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | పాపం!!! | (కథలు) | 'చలం' | 0-12-0 |
| 2. | హంపీ కన్యలు | (నవల) | .. | 0-12-0 |
| 3. | అరుణ | .. | .. | 0-12-0 |
| 4. | బ్రాహ్మణీకం | .. | .. | 0-12-0 |
| 5. | ఆనావీలరు | .. | సౌరీస్ | 0-12-0 |
| 6. | మారుపేర్లు | .. | కుటుంబరావు | 0-12-0 |
| 7. | కులంలేని మనిషి | .. | .. | 0-12-0 |
| 8. | బడదీదీ | .. | శరత్‌బాబు | 0-12-0 |
| 9. | పతివ్రత | .. | .. | 0-12-0 |
| 10. | పల్లీయులు | .. | .. | 1 - 8-0 |
| 11. | దేవదాసు | .. | .. | 1 - 8-0 |
| 12. | పరిణీత | .. | .. | 0-12-0 |
| 13. | తోకచుక్క | (కథలు) | 'చక్రపాణి' | 0-12-0 |
| 14. | పాతమంగలి | .. | .. | 0-12-0 |
| 15. | వనఫూల్ రచనలు | .. | .. | 0-12-0 |
| 16. | పరశురాం కథలు | .. | .. | 0-12-0 |
| 17. | బెంగాలీ కథలు | .. | .. | 2 - 0-0 |
| 18. | మైత్రా కథలు | .. | .. | 2 - 0-0 |
| 19. | మూగజీవాలు | .. | గోఖలే | 0-12 0 |
| 20. | కదంబం | .. | నార్ల | 0-12-0 |
| 21. | రూం టు లెట్ | .. | బాలకృష్ణశాస్త్రి | 0-12-0 |
| 22. | మంగమ్మ | (నాటకం) | 'చలం' | 1 - 0-0 |
| 23. | పలితకేశము | (కావ్యం) | దువ్వూరి | 1 - 0-0 |
| 24. | కడలి పొంగులు | .. | సముద్రులు | 1 - 0-0 |

యువ బుక్ డిపో: మద్రాసు

